ఇండో - చైనాపై జెనీవా సంప్రతింపులు: ఫ్రెంచిప్రధాని మెండెస్‌ఫ్రాన్సు నిర్ణయం

—6 వ పేజీ

# ఆంధ్రపత్రిక

ఆంధ్రజిల్లాలలో కాంగ్రెస్ కార్యదర్శి శ్రీ బల్వంతరాయ్ మెహతా పర్యటన

—4 వ పేజీ

318866

THE ANDHRA PATRIKA · MADRAS. సంపుటం 41. సంచిక 97 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO శుక్రవారం 9-7-1954 Reg. No. M. 1118 6 పేజీలు వెల 1 అణా.

# ప్రాజెక్టుల నిర్మాణంలో ఆంధ్ర హైద్రాబాద్ పరస్పర సహకారం

## అత్యంతావశ్యకమని కాంగ్రెస్ కార్యదర్శి ఉద్బోధ

### విశాలాంధ్ర స్థాపనకు అనుకూల కారణాలు: శ్రీ మెహతా వివరణ

కర్నూలు, జులై 8: "ప్రాజెక్టులు మొదలయినవాటి నిర్మాణం విషయంలో ఆంధ్ర, హైద్రాబాదు ప్రభుత్వాలు పరస్పర సహకారంతో కృషి చేయవలసిన అవసరంవున్నది. విశాలాంధ్ర నిర్మాణానికి గల అనుకూల కారణాలలో ఇదొకటి" అని అఖిలభారత కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి శ్రీ బలవంతరాయ్ మెహతా ఈవేళ ఉదయం పత్రికా విలేఖరుల సమావేశంలో అన్నారు.

ఈ సమస్యసందర్భంలో శ్రీ మెహతా ఇంకా యిలా చెప్పారు:

"వాస్తవాలను ఉన్నవాటిని ఉన్నట్లు మనం గమనించాలి. ఒకే భాష వాడుకలోవున్న రాష్ట్రాలు ఇండియాలో ఉన్నవి. కనుక కేవలం భాషకారణంగా ఒకేభాష వాడుకలో గల రెండురాష్ట్రాలుండే అవకాశాన్ని తోసివేయలేము. మంచికాని, చెడుగాని అదంతా పరిస్థితులపై ఆధారపడి ఉంటుంది. ఒక భాషాప్రాంతం చాలా పెద్దదయినప్పుడు దాని విభజించవలసి వస్తుంది. ఈ సమస్యగురించి ఖచ్చితంగా యేమీచెప్పడానికి వీలులేదు. ప్రతిరాష్ట్రం పరిస్థితులనూ సమగ్రంగా పరిశీలించవలసిఉంటుంది. ఈ సమస్యా పరిశీలనకు ఒక కమిషన్ నియమించబడింది. ఆ కమిషన్‌కు అన్ని విషయాలనూ మనం వివరించవచ్చు. భాషాధారక రాష్ట్రాలు ఏర్పరచడానికి అవసరమైన విషయాలన్నింటినీ కనిపెట్టడానికి ఆ కమిషన్ నియమించబడింది."

భాషాధారక రాష్ట్రాల నిర్మాణానికి ఆటంకాలు కలిపించడానికే యీ కమిషన్ను నియమించారన్న అభిప్రాయమొకటి ప్రజలలో ఉన్నదని ఒక విలేఖరి తెలియజేయగా కమిషన్‌ను నియమించడంలో అట్టి ఉద్దేశమేమీ లేదని శ్రీ మెహతా అన్నారు.

విశాలాంధ్ర గురించి అఖిలభారత కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి ఇలా అన్నారు:

"కాంగ్రెసు కార్యవర్గం యీ సమస్య గురించి ఒక నిర్ణయం చెయ్యదగ్గ సమయం ఇంకా రాలేదు. ఇది చాలా చిక్కు సమస్య, కనుక యీ సమస్యను సమగ్రంగా సరిగ్గా పరిశీలించి నివేదిక సమర్పించేటందుకే గాను ఒక కమిషన్ను నియమించాం. ఆనివేదిక వచ్చిన తరువాత యీ సమస్యను పరిశీలించి ఒక నిర్ణయానికి రావచ్చు. నిర్ణయం చెయ్యడానికి ఇది సమయం కాదు. లక్షలాది ప్రజలకు సంబంధించిన సమస్య ఇది. వివరాలను అందచెయ్యడం ద్వారానూ, హక్కులు వాదోపవాదాలు మొదలయిన వాటిని సమగ్రంగా వివరించడం ద్వారాను కమిషన్ సరయిన నిర్ణయానికి రావడంలో సహాయపడడమే ప్రస్తుత కర్తవ్యం. కమిషన్ ప్రస్తుతం పరిశీలనా దశలో వున్నది. నిర్ణయంచేసే సమయం ఇంకారాలేదు. తొందరపాటువల్ల కమిషన్‌కు ఇబ్బంది కలగవచ్చు. యీ విషయంలో అపార్థాలను నివారించడానికిగాను కాంగ్రెస్ కార్యవర్గం దేశానికి కొన్ని సూచనలను చేసింది. ప్రజలకు సరయిన మార్గం చూపించడం ద్వారా యింతవరకు పరిస్థితిని అదుపులో ఉంచగలిగాం. కమిషన్ నివేదిక వచ్చిన తరువాతనే కాంగ్రెసు ఈ విషయంలో ఒక నిర్ణయానికి వస్తుంది. ఇందులో కాంగ్రెసు వాదులకు విభిన్నాభిప్రాయాలుండవచ్చు."

### గ్రామ పంచాయతీల సంస్కరణ సంఘం

#### శ్రీ బల్వంతరాయ్ మెహతా సూచన

కర్నూలు, జులై 8: గ్రామ పంచాయతీల సంస్కరణ సమస్యా పరిశీలనకు కాంగ్రెసు కార్యవర్గం నియమించిన సంఘంవారు అజ్మీర్ కాంగ్రెసు మహాసభకు పూర్వమే తమ నివేదికను అఖిలభారత కాంగ్రెసుకు సమర్పించే అవకాశం కనిపిస్తున్నది. యీ విషయం గురించి అఖిల భారత కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి శ్రీ బల్వంతరాయ్ ఈవేళ పత్రికా విలేఖరుల సమావేశంలో యిలా అన్నారు:

"ఆసంఘంవారు అన్ని రాష్ట్రాల నుంచీ పంచాయతీలకు సంబంధించిన వివరాలు సేకరించి, వివిధ రాష్ట్రాలలోని గ్రామపంచాయతీల లక్షణలనూ పరిశీలించడానికి ప్రయత్నిస్తున్నారు. తత్ఫలితంగా దేశంలో వివిధ ప్రాంతాలలో ఒకేరకం పంచాయతీ పరిపాలనా నిర్వహణ పద్ధతిని రూపొందించగలమని ఆసంఘంవారు ఆశిస్తున్నారు"

ఈపట్టణంలోని రహదారి బంగాళాలో జరిగిన కాంగ్రెసు కార్యకర్తల సమావేశంలో ప్రసంగించిన తరువాత ఆంధ్ర కాంగ్రెసు అధ్యక్షుడు— శ్రీ బెజవాడ గోపాలరెడ్డి, సహాయ కార్యదర్శి శ్రీ పి. పార్థసారథిగారలు వెంటరాగా, శ్రీ బల్వంతరాయ్ మెహతా ఇక్కడినుంచి కడపకు వెళ్ళారు.

## అమెరికా హైడ్రోజన్ బాంబుల పరీక్షలు

### ప్రమాదాల నివారణకు చర్యలు

న్యూయార్కు, జులై 6: ఎవరికీ అపాయం కల్గనివిధంగా, ఎట్టి దుష్టమైనవి పరిణామాలకు దారితీయని విధంగా ఇకనుంచి అమెరికా ఆటంబాంబు, హైడ్రోజన్‌బాంబు పరీక్షలను కొనసాగిస్తుందని సమితి ధర్మకర్తృత్వ సంఘంలో అమెరికా ప్రతినిధిగా వున్న మేసన్‌సియర్స్ అనే ఆయన నేడు వ్యక్తంచేశారు.

మార్షల్ ద్వీపాల్లో జరిగిన పరీక్షల మూలంగా ప్రవాసులయిన జనం తేలకుంటున్నారని, అందుకు అమెరికా ఎంతో సంతోషిస్తున్నదని గూడా ఆయన యీ సందర్భంలో వెల్లడిచేశారు. యీ పరీక్షల అపాయాలకు గురియైన వారిపట్ల అమెరికా ప్రజలు సాటలేని సానుభూతిని చూపుతున్నారన్నారు.

ఈయనకంటే కొంచెంముందు ఇండియా ప్రతినిధి శ్రీ అవతార్ సింగ్ వేసిన ప్రశ్నకు సమాధానం ఇస్తూ యీ మార్షల్ దీవులను ఏలుతున్న అమెరికా అధికారి ఫ్రాంక్ మిడ్‌కిఫ్ తాము జరిపించిన మొదటి బాంబుపరీక్షకు ఫలితంగా ఒక దీవికి దీవి మాయమైపోయిందని, రెండోపరీక్షలో ఇంకోదీవి అయిపోయిందని చెప్పారు. ఇందులో ఏ దీవిలో గాని జనం నివసించడంలేదు. పసుపక్ష్యాదులుగూడా అంతగా నివసించేవు. వాటే మార్షల్ దీవుల్లో జనాభా యీ పరీక్షలవల్ల ఎట్టి విపరిణామాలకు దారితీసినాయో ఇంకా పూర్తిగా తెలియదని, ఇంతవరకు తెలిసిన నష్టం గూడా ఎట్లావుందో తనకు తెలియదని అన్నారు.

ఇప్పుడు మార్షల్ ద్వీపవాసుల యీ పరీక్షలను ఆపించవలసిందిగా పెట్టుకొన్న అభ్యర్థనను పురస్కరించుకొని, రష్యా యీ సంఘంలో ఒక తీర్మానాన్ని ప్రతిపాదిస్తున్నది. దాని వివరాలు యిమిటో ఇంకా తెలియరాలేదు. కాని పసిఫిక్ ప్రాంతంలో హైడ్రోజన్ బాంబు పరీక్షలను గురించి సమితి రష్యా గట్టి ఆందోళనను లేవదీస్తుందని ఆదేశం ప్రతినిధులు అంటున్నారు.

### న్యాయశాఖ మంత్రి కార్యక్రమం

కర్నూలు, జులై 8: ఆంధ్రప్రభుత్వ ఆర్థిక, న్యాయశాఖల మంత్రి శ్రీ తెన్నేటి విశ్వనాథంగారు రేపురాత్రి ఇక్కడినుంచి బయలుదేరి సికింద్రాబాద్ మీదుగా ఢిల్లీ వెళ్ళి కేంద్ర ఆర్థిక మంత్రితో ఆంధ్రరాష్ట్రానికి సంబంధించిన వ్యవహారాలను గురించి మాట్లాడతారు. ఈనెల 11 వ తేదీనుంచి 14వ తేదీవరకూ ఆయన ఢిల్లీలో వుంటారు.

## బ్రిటిష్ గయానా ప్రజానాయకుల నిరాహారదీక్ష

### కారాగారంలోనిదుర్భరపరిస్థితులకుఅసమ్మతి

జార్జిటౌన్, జులై 7: డా॥ చెడిజగన్ మరియితర పి. పి. పి. నాయకులు గయానా జైళ్ళలో నిరాహార దీక్షను కొనసాగిస్తున్నారు.

జైలు అధికారులు తమ్ము రోజుకు 14 గంటలపాటు ఏకాంత కారాగారాల్లో బంధించి వుంచుతున్నందుకు అధిక్షేపణను తెలియజేయడానికి వీరి ఈ దీక్ష సాగుతోంది.

ఈ జైళ్లలో పరిస్థితులుచాల అధ్వాన్నంగా వున్నాయి. జైలు ఎత్తు ఏడు అడుగులు, వెడల్పు నాల్గు అడుగులు. సరిగ్గా కదలడానికిగూడా వీలులేనంత చిన్నదిగా వుంది. ఇటువంటి చీకటి ఖానాల్లో తమ్ము పడవేసి వుంచుతున్నందుకుగూడా వీరు ఈ అసమ్మతిని తెలియజేస్తున్నారు.

కరాచి, జులై 7: త్వరలోనే టర్కీ పాకిస్తానల సైనిక సమాధానాన్ని కుదుర్చుకుంటాయని పాక్ ప్రభుత్వ వర్గాలవారు అంటున్నారు.

## సంప్రదింపులద్వారా కొరియా ఏకీకరణ

### ఇంకా సాధ్యమేనని నాంఇర్ అభిప్రాయం

హాంకాంగ్, జులై 8: జెనీవా సమావేశం కొరియా సమస్యపై ఒక నిర్ణీత పథాన్ని అనుసరించినప్పటికీ, సంప్రదింపులద్వారా కొరియాను ఏకం చేయటం సాధ్య ఇంకా తాను అభిప్రాయపడుతున్నట్లు ఉత్తరకొరియా విదేశాంగమంత్రి నాంఇర్ నేడిక్కడ ప్రకటించారు.

కొన్ని అంశాలపై తీవ్రవిభేదాలు ఏర్పడినప్పటికీ, ప్రధానాంశాలపై ఒప్పందం సాధ్యమేనని జెనీవాసభ వెల్లడించిందని నాంఇర్ అన్నారు.

## శ్వేత ఆస్ట్రేలియా విధానం

### మార్పు వుండదని మంత్రి ప్రకటన

కాంబెర్రా, జులై 7: ఆస్ట్రేలియా అనుసరిస్తున్న శ్వేత ఆస్ట్రేలియా విధానంలో ఎట్టి మార్పు వుండదని ఆ దేశం వలస విధానశాఖ మంత్రి హారాల్డు హోల్టు నేడు స్పష్టంగా ఒక ప్రకటన చేశారు.

ఈ విధానానికి సంబంధించి ఈ మధ్య కొంత రగడ బయలుదేరిన కారణంగా తానీ ప్రకటన చేస్తున్నట్లు, ఆ విధానంలో ఎట్టి మార్పుగాని వుండదని పునరుద్ఘాటించడమే ఆశయం అయినట్లు ఆయన ఇందులో పేర్కొన్నారు.

ఆస్ట్రేలియాఅనుసరిస్తున్న ఈ శ్వేతాధివాస విధానాన్ని అన్ని పార్టీలు బలపరుస్తున్నాయి. మరి ఈ విధానం జాత్యహంకారాన్ని పురస్కరించుకొని గూడా ఏర్పడింది కాదు. జాతి, సంస్కృతి, ఆర్థిక ప్రపత్తి, వీటిలో ఆయీరకాలజాతుల మధ్యవున్న తేడాలవల్ల వారు, వీరు, కలియడం అసాధ్యం అని గుర్తించడంవల్లనే ఈ విధానాన్ని అనుసరించ వలసి వస్తున్నది. దీన్ని ఇట్లాగాక, ఇంకోవిధంగా మారిస్తే అనేక సమస్యలు పుట్టుకు వస్తాయి. ఆస్ట్రేలియా జాతిని నిర్మించడానికి ఇంతకంటే మంచి పద్ధతి లేదని ఆయన విశదం చేశారు.

## మద్యనిషేధంపై ఆంధ్ర అసెంబ్లీ తీర్మానం

### అమలు జరపడంపై కాంగ్రెస్ కార్యదర్శి అభిప్రాయం

కర్నూలు, జులై 8: "మద్య నిషేధ సమస్య విషయంలో ఒక తీర్మానం చేయడం ద్వారా మే మొక మార్గం చూపించాం. అది స్పష్టంగా ఉన్నది. ఆంధ్ర రాష్ట్రానికే కాక అన్ని రాష్ట్రాలకూ అది మార్గం చూపిస్తున్నది. అతీర్మానాన్ని ఇప్పుడు అమలు జరుపుతున్నా రనుకొంటున్నాను. ప్లానింగు కమిషన్ కూడా యీ సమస్యను సమగ్రంగా పరిశీలిస్తున్నది" అని అఖిల భారత కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి శ్రీ బల్వంతిరాయ్ మెహతా నేటి ఉదయం ఉపముఖ్య మంత్రి శ్రీ నీలం సంజీవ రెడ్డిగారి నివాసంలో జరిగిన పత్రికా విలేఖరుల సమావేశంలో అన్నారు.

ఈసందర్భంలో మెహతా యింకా యిలా చెప్పారు.

"ఆంధ్ర శాసనసభ మద్యనిషేధ సమస్యగురించి ఆమోదించిన తీర్మానం ఒక సిఫార్సు మాత్రమే. సముచితరీతిని ప్రభుత్వం ఆతీర్మానాన్ని పరిశీలిస్తుంది."

తీర్మానాన్ని మద్యనిషేధ శాఖ మంత్రి ప్రతిపాదించారు. కనుక దానికి ప్రత్యేక ప్రాముఖ్యం వుంటుందన్న విషయం ఆయనదృష్టికి తీసుకురాగా "రాజ్యాంగం దృష్ట్యా అసెంబ్లీ తీర్మానం సిఫార్సు మాత్రమే అవుతుంది. మొదట అసెంబ్లీలో ప్రతిపాదించబడిన తీర్మానం మంత్రికి ఆమోదయోగ్యమయి ఉండవచ్చు కాని, ఆ తీర్మానానికి చేయబడిన సవరణలను మాత్రం పరిశీలించవలసి వుంటుంది." అని శ్రీ మెహతా అన్నారు.

అసెంబ్లీ ఆమోదించిన తీర్మానాన్ని అమలుజరపక పోవడం ప్రజాస్వామిక సూత్రాలకు విరుద్ధం కాదా అని ప్రశ్నింగా "నాకు తెలిసినంతవరకూ అసెంబ్లీచేసే సిఫార్సు లన్నింటినీ ప్రభుత్వం సముచిత రీతిని పరిశీలించక తప్పదు అసెంబ్లీ ఆదేశిస్తే తప్ప తీర్మానం సిఫార్సు మాత్రమే అవుతుంది. విశ్వాస తీర్మానంపై వోట్ తీసుకోవాలని కోరడం ద్వారా అసెంబ్లీ ఆదేశం ఇవ్వవచ్చు. అట్టి పరిస్థితిలో ప్రభుత్వం అసెంబ్లీ ఆమోదించిన తీర్మానాన్ని అమలుజరపనైనా అమలు జరపాలి, లేదా అధికారం నుంచి వైదొలగనయినా వైదొలగాలి. ప్రభుత్వం ఒక ప్రత్యేక విధానాన్ని అమలుజరపాలని అసెంబ్లి భావించినప్పుడు అవిశ్వాస తీర్మానం ప్రతిపాదించే వీలు శాసనసభకు ఉన్నది" అని అఖిలభారత కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి వివరించారు.

'నీరా' సమస్యగురించి ప్రస్తావిస్తూ ఆ ప్రణాళికను అమలుజరపడానికినియమించే సిబ్బందిపై దాని జయాపజయాలు ఆధారపడి ఉంటవని శ్రీ మెహతా చెప్పారు. అదికేవలం స్థానిక సమస్య అని కూడా ఆయన అన్నారు.

## సూయజ్‌పై సంప్రతింపులు

కైరో, జులై 8: సూయజ్ కాలువ సమస్యమీద తిరిగీ సంప్రదింపులు ప్రారంభించ వలసిందని బ్రిటన్ నేడు ఈజిప్టును కోరింది.

## జెనీవాకు మాలటోవ్ ఆగమనం

జెనీవా, జులై 8: ఇండో చైనాపై సంప్రదింపులు కొనసాగించే నిమిత్తం సోవియట్ విదేశాంగ మంత్రి మాలటోవ్ ఈవేళ పొద్దున మాస్కోనుంచి ఇక్కడికి తిరిగి వచ్చారు.

## దినదినాభివృద్ధిచెందుతున్న దేశ శక్తిసామర్థ్యాలకు ప్రత్యక్ష నిదర్శనం

### "నెహ్రూను అమెరికా గుర్తించలేకపోయింది"

#### —మెథాడిస్టు మతగురువు వాకాం పికెట్ విమర్శ

న్యూయార్కు, జులై 8: ప్రపంచాన్ని ఋజుమార్గాన నడిపించగల భారతప్రధాని ఉజ్వలనాయకత్వాన్ని అమెరికా గుర్తించ లేకపోయిందని మెథాడిస్టు మతగురువు జె. వాకాం పికెట్ ఇటీవల అమెరికా ప్రజలకు నిర్దేశించిన ఒక ప్రసంగంలో అన్నారు.

"భారతదేశంలో 46 సంవత్సరాలు నివసించాను. అక్కడి ప్రజలతో కలసి మెలసి జీవించాను. వారి పట్ల ప్రేమాభిమానాలు పెంపొందించుకున్నాను. వారి భవిష్యత్తు గురించి నేను సదాఆలోచిస్తాను. భారతీయులు సాధించిన విజయాలకు నేను గర్విస్తున్నాను. వారి శక్తి సామర్థ్యాలనుఅమెరికా అవగాహన చేసుకోలేదనే నేను అభిప్రాయపడు తున్నాను." అని ఆయన స్పష్టపరచారు.

ప్రస్తుతం ప్రపంచ దేశాలలో అధికారంలోఉన్న వివిధరాజకీయ వేత్తలకూడ ప్రజాస్వామ్యంపట్ల తన విశ్వాసాన్ని నెహ్రూకన్నా ఎక్కువగా, నిరూపించలేదనే తాను అభిప్రాయపడుతున్నట్లు ఆయన చెప్పారు.

భారతదేశం అనుసరిస్తున్న విధానం తటస్థవాదం అని పేర్లు పెట్టడంలోనే మనం ఆదేశంమీద అన్యాయవిమర్శలు చేస్తున్నట్లు విశదమవుతున్నది. మనం కూడా గత రెండు ప్రపంచ యుద్ధాలలోనూ మన తాటస్థ్యతని వ్యక్తపరిచాం. మనకి పనికిరాదని తోచగానే వదలివేశాం. అని ఆయన అన్నారు.

## ఆగ్నేయాసియా రక్షణ ఒప్పందం

### బ్రిటన్ అమెరికాల సంప్రదింపులు

వాషింగ్టన్, జులై 7: ఆగ్నేయాసియాలో రక్షణ ఒప్పందం ఒకదానిని ఏర్పాటుచేసే విషయమై బ్రిటన్, అమెరికాలు నేడిక్కడ రహస్యసంప్రదింపులు ప్రారంభించినవి. ఇటీవల జరిగిన చర్చిల్ ఐసెన్‌హోవర్ సమావేశంలో ఇవిఏర్పాటైనవి.

బ్రిటిష్ ఉపరాయబారీ, ఆసియా వ్యవహార నిపుణుడూ అయిన రాబర్ట్ స్కాట్ బ్రిటన్ తరఫునా, అమెరికన్ ఉపవిదేశాంగమంత్రి బెడెల్ స్మిత్ అమెరికా తరఫునా సంప్రతింపులు సాగిస్తున్నారు.

ఆంగ్లో-అమెరికన్ నిపుణులు వెంటనే ఆస్ట్రేలియా, న్యూజీలాండ్ ప్రతినిధులను కలుసుకుని ఈసంప్రదింపుల్ని గురించి తెలియజేయగలరని తెలుస్తున్నది.

ఇదివరకొక అన్‌జూస్ (అమెరికా, ఆస్ట్రేలియా, న్యూజీలాండ్) ఒప్పందం దేశాలు విడిగా సంప్రదింపులు జరుపుతూ ఉండగలవని తెలుస్తున్నది.

అమెరికాతో ఈక్రింది అంశాలపై సంప్రదింపులు జరప నిశ్చయమయిందని బ్రిటిష్ విదేశాంగమంత్రి ఈడెన్ నేడు కామన్సులో తెలియజేశారు.

(1) ఆగ్నేయాసియాతో సంబంధాలు (2) యూరప్ రక్షణ వ్యవస్థ (3) అణుశక్తి రహస్యాలపై పరస్పర సహకారం.

### అమెరికా ఉపాధ్యక్షుడి అభిప్రాయం

అమెరికా ఉపాధ్యక్షుడు రిచర్డ్ నిక్సన్ నిన్న మిచీగాన రాష్ట్రంలో మాట్లాడుతూ, 'స్వేచ్ఛా' ప్రపంచపు భవిష్యత్తు తటస్థంగావున్న 60 కోట్ల ఆసియా ప్రజల నిర్ణయం మీద ఆధారపడివున్నదని అన్నారు. "ఈ 60కోట్ల ప్రజల సహాయాన్ని ఎవరు సంపాదిస్తారో వాళ్ళు ప్రపంచమంతటినీ జయించగలరు. ఈసంగతి మనకు తెలుసు, కమ్యూనిస్టు ప్రచారం బండారాన్ని బయటపెట్టటమేకాక, మన ఆచరణ ద్వారా ప్రజాస్వామ్యమే ఉత్తమ వ్యవస్థ అని నిరూపించ వలసివుంటుంది అని అన్నారు.

## సమితిలో కమ్యూనిస్టు చైనాకు ప్రాతినిధ్యం

### కూడదని ఐసెన్‌హోవర్ ఉద్ఘాటన

వాషింగ్టన్, జులై 7: ప్రస్తుత పరిస్థితుల్లో కమ్యూనిస్టు చైనాకు సమితిలో స్థానం ఇవ్వటాన్ని తాను పూర్తిగా వ్యతిరేకిస్తున్నట్లు ప్రెసిడెంట్ ఐసెన్‌హోవర్ నేడిక్కడ ప్రకటించారు. కమ్యూనిస్టు చైనాకు సమితిలో సభ్యత్వం ఇస్తే అమెరికా సమితినుంచి ఉపసంహరించుకునే విషయమై ఇంకా నిర్ణయమేమీ జరగలేదని ఆయన తెలియజేశారు.

కమ్యూనిస్టు చైనా జెనీవాలో సమితి అధికారాన్నే సవాలు చేస్తున్నదని ఆయన ఉద్ఘాటించారు.

### భక్రానంగాల్ ప్రాజెక్టు విశిష్టతగూర్చి నెహ్రూ ఉద్బోధ: కాలవలకు ప్రారంభోత్సవం

నంగల్, జులై 8: భక్రానంగల్ కాలువలకు ఇవ్వాళ ప్రధానామాత్యుడు జవహర్లాల్ నెహ్రూ ప్రారంభోత్సవం జరిపారు.

ఈ ప్రాజెక్టును భారతప్రజల శ్రేయస్సుకు అంకితమిస్తున్నాననీ, ఇటువంటి ప్రాజెక్టులు గుళ్ళు గోపురాలవంటివని తమ అభిప్రాయమనీ, వీటిని చూసినప్పుడు తమలో ఆధ్యాత్మిక భావన మరీ అధికమవుతుందనీ, ఈ ప్రాజెక్టు దిన దినాభివృద్ధి చెందుతున్న మన జాతి శక్తి సామర్థ్యాలకూ, అభ్యుదయపథంలో ముందడుగు వేయాలన్న మన కృతనిశ్చయానికీ ప్రత్యక్ష నిదర్శనమనీ నెహ్రూ అన్నారు.

ప్రారంభోత్సవానికి పరిసర గ్రామీణులు వేనవేలు సముత్సాహంతో వచ్చారు. పలువురు ప్రముఖులు పాల్గొన్నారు.

ప్రధాని ప్రసంగిస్తూ కాలవల విషయంలో పాకిస్తానుకూ మనకూ వచ్చిన అభిప్రాయభేదాలను ప్రస్తావించి, ఆ దేశానికి ఏదో కీడుచేయాలని మన వుద్దేశం ఎన్నటికీ కాదనీ, వాళ్ళ కాలవలవల్ల వాళ్లు పూర్తిప్రయోజనం పొందటంలో తోడ్పడటానికి మన మెప్పుడూ సంసిద్ధులమేననీ, అయితే, వాళ్లు తమ కాలవలను వృద్ధిచేసుకోకుండా చేసే ప్రస్తుత పరిస్థితినిమాత్రం మనం కొనసాగ నివ్వలేమనీ అన్నారు.

దేశంలో మనం నిర్మింప తలపెట్టిన వివిధప్రాజెక్టుల గురించి మాట్లాడుతూ భారతమాత ఇప్పుడు ప్రసవవేదన పడుతోందనీ, చిన్నవీ, పెద్దవీ అయిన అనేకమైన వాటికి జన్మనిస్తున్నదనీ అన్నారు.

ప్రభుత్వాన్ని ఎంత విమర్శించినా ఎంత తెగనాడినా తాము సహించగలరు గాని ప్రజలను గురించి నిరసనగా మాట్లాడితే మాత్రం తాము ఎంతమాత్రం సహింపజాలమన్నారు. 36 కోట్ల ప్రజ ముందడుగు వేస్తున్నారు. అదేమీ అల్పవిషయం కాదు. మన టెక్నీషియన్లకూ, కార్మికులకూ, దేశాభివృద్ధికి వలసినబ్రహ్మాండమైన ప్రాజెక్టులు కట్టటం ఎట్లాగో నేర్పేవిశ్వవిద్యాలయంవంటిది ఈ ప్రాజెక్టు దేశంనలుమూలలా మనం ఎటువంటి బ్రహ్మాండమైన పనులు చేస్తున్నామో దేశం తిరిగేవారికి తెలుస్తుంది. సింద్రీ, చిత్తరంజన్, బెంగుళూరు మొదలైన చోట్లకువెళ్లిన వారికి యావద్దేశమూ ఒక మహా సంరంభంలో వున్నట్లు ద్యోతకమవుతుంది. అని ఆయన అన్నారు.

విప్లవం అంటే తలలు బ్రద్దలుకొట్టుకోవటం కాదు. విప్లవం అంటే పెద్ద మార్పు తీసుకురావటం. మేము,అంటే మాతరంవాళ్లం, స్వాతంత్ర్యపోరాటం నడిపి దేశాన్ని స్వతంత్రం చేశాం. ప్రపంచంలో అదే ఒక పెద్ద మార్పు. శాంతియుతంగా జరిగినంత మాత్రాన అది విప్లవం కాదనటానికి వీలులేదు. అయితే ఈ విప్లవం పూర్తి కాలేదు. ఇది ఒకవిధంగా రాజకీయ రంగంలోమాత్రం పూర్తి అయింది. సాంఘిక ఆర్థికరంగాలలో ఇది ఇంకా కొనసాగవలసి వుంది. మనం స్తబ్ధులుగా పడివుండటానికి వీలు లేదు. అని కూడా నెహ్రూ అన్నారు.

పాకిస్తాన్ ధోరణిని గురించి మాట్లాడుతూ. మనదేశంలో ప్రజలకు పనిచేయాలనే భావం కలిగిందనీ, దానితో వారు అభ్యుదయ సాధనకై ఉత్సాహంతో కష్టపడి పనిచేస్తున్నారనీ, దురదృష్టవశాత్తూ పాకిస్తానులో కృత్రిమంగా అశాంతి కలిగించుకోవటానికీ ఇరుగుపొరుగుపై గొణుగుకోవటానికి వినియోగమవుతోందనీ, పాకిస్తాను భారతదేశం చేసేదాంట్లో నాల్గోవంతు చేసినా వారెంతో అభివృద్ధి చెందేవారనీ, ఇప్పుడు వారు తాము కష్టపడి కృషి చేయకపోగా ఇతరదేశాలుకూడా వెనకబడి వుండాలంటున్నారనీ, ఇతరులకు నష్టంకలిగిస్తూ తాము బాగుపడ్డ దేశం చరిత్రలో ఎక్కడా కనిపించదనీ అన్నారు.

ప్రధానమంత్రి ప్రపంచంలోకెల్లా పెద్దదైన ఈకాలవలకు ప్రారంభోత్సవం జరపటానికి ప్రత్యేకరైలులో ఈ ప్రాతఃకాలం ఇక్కడికి వచ్చారు. పంజాబు గవర్నరు సి. పి. ఎన్. సింగు, ముఖ్యమంత్రి భీమసేన్ సాచార్, ప్రాజెక్టు నిర్మించిన ఇంజనీర్లు మొదలైనవారు ఆయనకు ఘనమైన స్వాగతమిచ్చారు. ఇందిరా గాంధీ కూడా వచ్చారు.

### వెండితో చేసిన స్లూస్ నమూనా బహూకృతి

ఈభక్రా-నంగాల్ హైడ్రో ఎలెక్ట్రిక్ పవర్ సప్లయి కాలువ స్లూస్ గేట్ల నమూనాను వెండితో చేసినదానిని తూర్పుపంజాబ్ ముఖ్యమంత్రి భీమసేన్ సాచార్ ప్రధాని నెహ్రూకు బహూకరించారు. ప్రధాని విద్యుచ్ఛక్తిమీటనొక్కి గేటను తెరిచిన సమయానికి సరిగ్గా ప్రాజెక్టువివరాలన్నింటినీ ఇస్తున్న రంగురంగుల కరపత్రాలు విమానంలో నుంచి కిందికి వెదజల్లబడినవి.

తూర్పుపంజాబ్ నీటిపారుదలమంత్రి వేహారీసింగ్ ప్రధానిని ఆహ్వానిస్తూ ప్రాజెక్టుపూర్వాపరాలను వివరించారు.

పంజాబ్ విభజన సందర్భంలో భారతదేశం భాగానికి 34 వంతుల భూమి, 42 వంతుల జనాభా రాగా, కాలువలుమాత్రం 20 వంతులే వచ్చినవి. ఆహార కొరతను నివారించేందుకు

(3 వ పేజీ చూడుడు)

## గంటల పంచాంగం

శ్రీ జయ సం॥ ఆషాఢ శు॥ నవమి
1954 సం॥ జూలై 9 శుక్రవారం
శు॥ నవమి 22-31 చిత్త 12-19 వర్జ్యం 18-36 ల 20-24 కు.
శు॥ దశమి జూలై 10 శనివారం
శు॥ దశమి 24-47 స్వాతి 15-13 వర్జ్యం 21-27 ల 23-14 కు.


# ఆంధ్రపత్రిక

ఒరు లేయవి యొనరించిన నరవర
యప్రియము తన మనంబున కగు దా
నొరులకు నవిసేయకునికి పరాయణము
పరమధర్మపథములకెల్లన్ -(మహాభారతము)

శ్రీ జయ సం॥ ఆషాఢ శు॥ నవమి
శుక్రవారం


## వేరుశనగ పంటదారులకు రక్షణ

వరి తర్వాత ఆంధ్రలో విశేషంగా పండే పంట వేరుశనగ. దాదాపు నలభైమూడు లక్షల ఎకరాల్లో ఇరవై ఎనిమిది లక్షల టన్నుల వరి ధాన్యం ఉత్పత్తి అవుతూ వుండగా, మూమారు ఇరవైమూడు లక్షల ఎకరాల్లో ఎనిమిదిన్నర లక్షల టన్నుల వేరుశనగ పండుతున్నది. ఆంధ్ర రాష్ట్రంలో ఇదే ప్రధానమైన వాణిజ్య పంట. 1951-వ సంవత్సరం పంటల లెక్కలను బట్టి ఆంధ్ర రాష్ట్రంలో నాలుగు యాభై కోట్ల రూపాయిల విలువ గల వేరుశనగ ఉత్పత్తి అవుతున్నది. మిర్చి దాదాపు ఒక లక్ష టన్నులు పండుతుంది. ఈపంట విలువ 23 కోట్ల రూపాయిల వరకూ వుంటుంది. పొగాకు వాణిజ్య పంటలలో తృతీయ స్థానం మాత్రమే. అయినప్పటికీ పొగాకు వ్యాపారంలో ఏర్పడిన మాంద్యం కల్గించినంత సంచలనాన్ని వేరుశనగ వ్యాపారంలో ఏర్పడిన విషాద పరిస్థితి కల్గించలేదు. ఈ పరిస్థితిని తొలగించడానికి ఇంతవరకూ ప్రయత్నం జరగలేదు సరికదా. అసలు పరిస్థితులు ప్రమాదకరంగా పరిణమించిన వని అధికారులు గుర్తించనైనా లేదు.

వేరుశనగ ధర విపరీతంగా పడిపోయినది. అనంతపురంజిల్లా పరిస్థితులను గురించి ఆ జిల్లా ప్రముఖులు చేసిన ప్రకటనను బట్టి మణుగు పది రూపాయిల వంతున విత్తనాలు కొని పైరు చేస్తే పంట దిగుబడి అయ్యేనాటు మణుగు ధర ఏగానికి ఏగం పడిపోయినట్లు కన్పిస్తున్నది. ధర పడిపోవడం ఒక్కటేగాదు సమస్య. వరకు విడుదలకుకూడా అవకాశాలు లేకుండాపోయినవి. ఎగుమతులను కేంద్ర ప్రభుత్వం కోటా పద్ధతిలో పరిమితం చేసినది. రాష్ట్రంలో పండే ఎనిమిదిన్నర లక్షల టన్నుల వేరుశనగ రాష్ట్రంలో వినియోగం కావడానికి అవకాశం లేదు. నూనె మిల్లులు, వనస్పతిమిల్లులు పెరిగినప్పటికీ ఆ మిల్లులు పంటనంతటినీ ఉపయోగించుకునే అవకాశం వుండదు. ఈ మిల్లుల సంఖ్యను పెంచడానికి కూడ ప్రస్తుత పరిస్థితులు అంత అనుకూలంగా వున్నట్లు కన్పించదు.

ద్వితీయ ప్రపంచ సంగ్రామానికి పూర్వము దేశంలో పండే నూనెగింజలు ఎక్కువగా విదేశాలకు ఎగుమతి అవుతూవుండేవి. ఈ ఎగుమతులలో హెచ్చుభాగం ఇటలీ, ఇతర యూరపు దేశాలకు వెళ్లేవి. యుద్ధం ప్రారంభం కావడంతో ఈ ఎగుమతులు నిల్చిపోవడం, దేశంలోనే నూనె తయారుచేసే మిల్లులను ప్రారంభించడం జరిగింది. అయినా నూనెగింజల పంట పూర్తిగా దేశంలో వినియోగం కావడం లేదు. ఆంధ్రరాష్ట్రం నుంచి ఏటా ఇతర ప్రాంతాలకు ఏడు కోట్ల ముప్ఫయితొమ్మిది లక్షల రూపాయిల విలువ గల వేరుశనగ ఎగుమతి అవుతున్నది. అంటే నలభైకోట్ల రూపాయిల విలువ గల వేరుశనగ రాష్ట్రంలోనే వినియోగం కావలసివుంటుంది. మన రాష్ట్రంలో అంత వరకు విడుదలకు అవకాశం వున్నట్లు కన్పించదు. కనుక రాష్ట్రంలోని వేరుశనగ పంటదారులకు శాశ్వత రక్షణను కల్పించడానికి ఎగుమతి ఏర్పాట్లు చేయవలసివుంటుంది. రాష్ట్రంలో 480 నూనె మిల్లులున్నవి. రాష్ట్రంలో పండె నూనె గింజలనుంచి, నూనెను,పిట్టును తయారుచేయడానికి ప్రస్తుతం వున్న మిల్లులు సరిపోవచ్చును. కాని నూనె ఎగుమతికి అవకాశం లేనప్పుడు మిల్లులవారు నూనె గింజలను కొని నూనె తయారు చేసే అవకాశం వుండదు.

కేంద్ర ప్రభుత్వం నిర్ణయించిన ఎగుమతి కోటాలను పెంచినగాని వేరుశనగ వ్యాపారంలో ప్రస్తుతం ఏర్పడిన క్లిష్ట స్థితి తొలిగే అవకాశం లేదని రాష్ట్ర వ్యవసాయమంత్రి శ్రీ తిమ్మారెడ్డిగారు స్పష్టంచేశారు. పొగాకు విషయంలోవలెనే వేరుశనగ విషయంలో నూ కేంద్ర వాణిజ్యమంత్రి వర్గంలో దర్యాలు తీసుకొని రాష్ట్రంలో ఏర్పడిన విషాద పరిస్థితులను తొలగించవలసి యుంటుంది. అవసరమైతే ఇప్పటి ఎగుమతి విధానాన్ని సవరించిఅయినా కేంద్ర ప్రభుత్వం వేరుశనగ రైతులకు తక్షణం రక్షణ కల్పించగలదని విశ్వసిస్తున్నాము.

## ప్రపంచ కాలెండరు

### ప్రొ. మేఘనాద్ శాహా ప్రతిపాదన

జెనీవా, జూలై 7: ప్రపంచం అంతటికీ వర్తించే కాలెండర్ ప్రవేశపెట్టేందుకు అధికారరీత్యా మొదటి చర్య నేడిక్కడ తీసుకోబడ్డది. ప్రముఖ భారతీయ శాస్త్రజ్ఞుడు ప్రొఫెసర్ మేఘనాద్ శాహా నేడిక్కడ సమితి ఆర్థిక సంఘ ఉప సంఘంలో ఒక ప్రపంచ కాలెండర్‌ను ప్రతిపాదించారు.

అందులో అంశాలు ఇవి:

ఈ కాలెండర్‌నుబట్టి సంవత్సరాన్ని నాలుగు భాగాలుగా చేస్తారు. ఒక్కొక్క భాగానికి 91 రోజులు ఉంటవి. మొదటి పాదం జనవరితోనూ, రెండవపాదం ఏప్రిల్‌తోనూ, మూడవపాదం జులైతోనూ, నాల్గవ పాదం అక్టోబర్‌తోనూ మొదలవుతవి. ఈ నాలుగు నెలలకూ 31 రోజులు ఉంటవి. ఈ పద్ధతికింద సం॥ నికి 366 రోజులు ఉంటవి. ఏడాదిలో చివరి రోజుకి—31 వ తేదీ— 'ప్రపంచ దినం'గా లెక్కవేయ బడుతుంది. అది వారాల లెక్కలోకి రాదు.

ఈ కాలెండరును ప్రతిపాదించటంలో తమ ఉద్దేశ్యం అందరికీ ఒకే కాలమానం ఏర్పాటు చేయటమేననీ, ప్రజల నుత, సాంఘిక వ్యవహారాలలో సౌకర్యం కలిగించుకునే ఉద్దేశమేలేదనీ ప్రొ॥ శాహా అన్నారు.

## మైసూర్ కళాశాలా ప్రిన్సిపాల్ పదవి

మైసూరు, జూలై 7: ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఇదివరకు ప్రొఫెసరుగానున్న డాక్టర్ టి. వి. పురుషోత్తమ్‌గారిని మైసూరు మహారాజా కళాశాల ప్రిన్సిపాల్‌గా నియమించారు.

### ఆహారపదార్థాల నిల్వ

మైసూరు, జూలై 7: మైసూరు ప్రభుత్వంవద్ద యిప్పుడు 50 వేల టన్నుల ఆహారధాన్యాలు నిల్వఉన్నాయని తెలుస్తున్నది. (ప్ర. ఐ.)

## సామాజిక విప్లవసాధనకు భూదానం ఉత్తమమార్గం

### శ్రీ జయప్రకాశ నారాయణ్ ఉద్ఘాటన

న్యూఢిల్లీ, జులై 7; "ఆర్థిక సామాజిక విప్లవ సాధనకు గాంధీజీ సిద్ధాంతాలు ఆధారంగా రూపొందిన విధానమే భూదాన ఉద్యమం. సవజీవన ప్రదాయకమైన వినూత్న విధానమే భూదానం. మానవత కూ నవనాగరకతకూ కవాటాలు తెరచేది ఇది" అని శ్రీ జయప్రకాశ్ నారాయణ్ నేటి రాత్రి భూదాన ఉద్యమం గురించి ఢిల్లీ రేడియో కేంద్రంనుంచి ప్రసంగిస్తూ ఉద్ఘాటించారు.

నేటి సాంఘిక ఆర్థిక వ్యవస్థలలో అన్యాయాలవల్ల ఏర్పడిన సమస్యలను ఎదుర్కోడానికీ, సాంఘిక వ్యవస్థలో మార్పు సాధించడానికీ, సత్యాహింస సిద్ధాంతాలను విప్లవాత్మక విధానంలో వర్తింపచేయడానికే ఇది ఏర్పడిందనీ, ఇంతటి మహోద్యమం సరిగా అవగాహన చేసుకోబడక పోవడం శోచనీయమనీ జయప్రకాశ్ నారాయణ్ అన్నారు.

"ఇందులో మరొక చిత్రమైన విషయం ఏమిటంటే, ఈ ఉద్యమాన్ని అపార్థం చేసుకున్నవారిలో ఎక్కువమంది విద్యావంతులేక అవడం. నిజానికి నేటి మన విద్యావిధానం, ప్రజలకీ, వారి సమస్యలకీ ఆమడదూరాన ఉంది. కేవలం బాహ్యాడంబర యుతమైనది అయింది. ఇది చూస్తుంటే, చదువు రానివారికి చదువు నేర్పడం ఎంత అవసరమో, చదువు వచ్చినవారు విద్యావంతుల మనుకుంటూ పడే గర్వాన్ని తొలగించడంకూడా అంత అవసరమే నని పిస్తున్నది." అంటూ ఈ భూదాన ఉద్యమం గురించి అందరూ సమగ్రంగా తెలుసుకోవలసిందని ఆయన విజ్ఞప్తి చేశారు.

భూదానం అన్నప్పుడు కేవలం భూమిని దానం చెయ్యడం గురించే తాను ప్రస్తావిస్తున్నా ననుకోరాదనీ, ఈ పదం సువిస్తృత పరిధికి వర్తిస్తుందనీ, భూదానంలో సంపత్తి దానము శ్రమదానము, బుద్ధిదానమూ కూడా చేరినవేననీ ఆయన వివరీకరించారు.

అసలు ఈ దానము అనే పదం వినగానే, వినోబాజీ ఏదో ధర్మంగా ఇవ్వమని యాచిస్తున్నారనే అపార్థం ఏర్పడుతున్నది. వినోబాజీ "ఈ దానము" అనే పదాన్ని దాని విశిష్టార్థంలో ప్రయోగిస్తున్నారు. శంకరుడు ప్రవచించినట్లు 'దానం సమవిభాగః' అంటే దానము అనగా సమానంగా ఆస్తి విభజించి ఇవ్వడం అనే అర్థంలోనే వినోబాభావేకూడా ఈపదాన్ని ప్రయోగిస్తున్నారు. అందువల్ల భూదానం అంటే దయాధర్మంగా ఇవ్వవలసిందనే యాచన అని అపార్థం చేసుకోరాదు. ఈ భూదాన ఉద్యమం వెనుక గాంధీజీ చెప్పిన ధర్మకర్తృత్వ సిద్ధాంతం ఉంది. ఈ సిద్ధాంతం చెప్పేది ప్రతివారూ తమ తమ ఆస్తులకు యజమానులు కారని వారు కేవలం ధర్మకర్తలు. ఆ ఆస్తి సమాజనిది. అందువల్ల, వారు తమ అవసరాలకు కావలసింది వినియోగించుకుని మిగతాది సమాజానికే ఇవ్వాలి. సమాజానికి చెందిన ఆస్తిని దానికి ఇవ్వడం దానం కాదు. ఒకవిధి. అలా ఇవ్వకపోవడం అవినీతి.

ధార్మికత విశిష్టలక్షణమే. కాని, ఒకరుఇస్తే మరొకరు పుచ్చుకోవడం అనే వాస్తవికత సమాజంలోని ఎగుడు దిగుళ్లనీ, న్యాయాన్యాయాలనీ ఎలుగెత్తి చాటుతున్నది. నేటి ఈసామాజిక వ్యవస్థలో యీఅసమానతనినిర్మూలింపచేయడమే వినోబాభావే తలపెట్టిన యీమహోద్యమ లక్ష్యం.

సత్యాగ్రహం అనేది హృదయ పరివర్తనకు నిర్దేశించిన ఒక వినూత్న విధానము. హృదయపరివర్తనం సర్వత్రా సాధ్యమని మనలో చాలామంది నమ్మరు. కాని అహింసకూ, నిర్బంధంచేసే శాసనాలకూ తావుఇవ్వని ఈఉత్కృష్ట విధానం వ్యక్తిగతంగా వీక్షించి పరివర్తన తేగలదు. "భూస్వామ్యం" అనే భావాన్ని, అనుభూతిని క్రమేపీ తొలగించి "మనం భూమికి ధర్మకర్తలం మాత్రమే" అనే అభిప్రాయాన్ని బీదా గొప్పా అందరిలోనూ వ్యాపింపజేయటానికి ఇది కృషి చేస్తుంది.

చివరకి భూమికి స్వాములం అనే అభిప్రాయం స్థానే ధర్మకర్తలం అనే అభిప్రాయమే అఖిలప్రజానీకంలోను పాతుకుపోతుంది. అలవాటవుతుంది. ఆచారమౌతుంది. ఈహృదయపరివర్తన ఒక ధనికులలోనే కాదు సెంటు భూమికి స్వామి అయిన బీదవానిలో కూడా రావలసింది.

భూమి పంపకం గురించి వివరిస్తూ జయప్రకాశ్ నారాయణ్ ఈవిధంగా చెప్పారు:

"సేకరించిన భూమిని మొదట, అసలు భూమిలేని రైతులకు, వారే స్వయం సేద్యం చేయాలనే నియమంపై పంచిపెట్టబడుతుంది. ఇంకా మిగిలినభూమిని, కొద్ది భూములూ పెద్ద కుటుంబాలూ గల రైతులకు పంచడం జరుగుతుంది. పంపకం పూర్తిగా ఆయా గ్రామస్థుల అభిమతాల ప్రకారమే జరుగుతుంది."

భూదానంలాగే పట్టణాలలో సంపత్తి దానోద్యమం ప్రారంభించబడుతుందనీ, అక్కడకూడా, ప్రతివారి [illegible] చేస్తా మనీ, ఇదే విధంగా బుద్ధిదానమూ, శ్రమదానమూ కోరగలమనీ జయప్రకాశ్ వివరించారు.

"మనకి ఉన్నది ఇతరులతో పంచుకోవాలి. ఇవ్వడానికి ఆస్తి లేకపోతే శ్రమదానం చేయాలి. మన సహృదయాన్ని ఇవ్వాలి." అని ఆయన అభిభాషించారు.

## హైకోర్టు అవతరణోత్సవం

### జయప్రదం చేసిన వారికి న్యాయశాఖా కార్యదర్శి ధన్యవాదాలు

గుంటూరు, జులై 6: ఆంధ్ర హైకోర్టు ప్రారంభోత్సవానికి న్యాయశాఖ కార్యదర్శి శ్రీ బి. పి. హెచ్. నారాయణమూర్తి, హోంశాఖ సంయుక్త కార్యదర్శి శ్రీ సి. నరసింహం న్యాయశాఖ ఉపకార్యదర్శి శ్రీ వి. కామేశ్వరరావు ఇక్కడికి వారం రోజులు ముందుగానే వచ్చి ఆంధ్రప్రభుత్వం తరఫున ఏర్పాట్లు చేసిన మాట పాఠకులకు విదితమే. ప్రారంభోత్సవం అయిన తరువాత శ్రీ నారాయణమూర్తి గారు ఆంధ్రపత్రిక విలేఖరితో మాట్లాడుతూ, ఈ మహాకార్యంలో తమకు సహాయపడిన వారందరికీ, కృతజ్ఞత తెల్పారు. ముఖ్యంగా 'చీఫ్ ఇంజనీర్ శ్రీ ఫ్రెడరిక్, సూపరింటెండింగ్ ఇంజనీర్ శ్రీ జి. ఎ. నరసింహారావు. వారి సిబ్బంది... యీ ఉత్సవం విజయవంతం కావటానికి చేసిన కృషికి శ్రీ నారాయణమూర్తిగారు కృతజ్ఞత తెల్పారు. పదిహేను వందలమంది న్యాయవాదులకు పైగా ఆహ్వానాలు పంపబడ్డాయని వచ్చిన న్యాయవాదు లందరికీ వసతులు కల్పించిన గుంటూరు న్యాయవాద సంఘ అధ్యక్ష, కార్యదర్శులకు తాము కృతజ్ఞులమని అన్నారు. ఈ ఉత్సవానికి అవసరమైన విద్యుచ్ఛక్తి ఏర్పాట్ల స్వయంగా చేయించిన మద్రాసు చీఫ్ ఎలెక్ట్రికల్ ఇన్‌స్పెక్టర్ శ్రీ కొంతయ్యకు శాసన సభ్యులకు పార్లమెంటు సభ్యులకు ఆతిథ్యమిచ్చిన గుంటూరు పురపాలక సంఘానికి, వచ్చిన ప్రముఖప్రతినిధులకు శ్రీ నారాయణమూర్తి తమ ధన్యవాదాలర్పించారు.

## సంస్థానాధిపతుల 'భరణాల' మొత్తం

### ప్రధానమంత్రి నెహ్రూ సూచన

హైదరాబాదు, జూలై 7: భారత దేశంలోని పెద్దసంస్థానాధిపతులు తమ 'భరణాల' నుంచి నూటికి పదిహేను వంతులు సాలీనా తాము పాలించిన సంస్థానాల ప్రజలశ్రేయస్సుకు ఇవ్వాలని ప్రధానమంత్రి నెహ్రూ సూచించారని ఇక్కడ అతి విశ్వసనీయంగా భావించబడుతోంది.

ఇంతకన్నా తక్కువ 'భరణాల'ను పొందే సంస్థానాధీశులు అదేవిధంగా నూటికి తక్కువవంతు మొత్తాన్ని చెల్లించాలనికూడా సూచించారు.

తమ 'భరణాల'లో స్వచ్ఛందంగా తమంతటతామే తగ్గింపుచేసుకోమని ఇదివరకుచేసిన అభ్యర్థన స్థానే ఈ సూచనను అన్ని సంస్థానాధిపతులకు ఒక సర్క్యులర్‌లో చేయబడినట్లు భావించబడుతోంది.

తమ 'భరణాల'లో నూటికి 15 వంతులు జాతీయాభివృద్ధి ఋణంకు చెల్లించమనికూడా నెహ్రూ కోరారు.

## లారీలపై పన్ను

### ఆంధ్ర మద్రాసుప్రభుత్వాల ఒప్పందం

కర్నూలు, జూలై 8: ఆంధ్ర, మదరాసు రాష్ట్రాలలో తిరిగే లారీలపై పన్ను విధించే విషయంలో యీ రెండు ప్రభుత్వాలమధ్య ఒక ఒప్పందం కుదిరినట్లు ఈవేళ అధికారరీత్యా తెలిసింది.

ఇట్టి ఏర్పాటు ఫలితంగా ఈ రెండు రాష్ట్రాల సరిహద్దులలోవున్న ప్రాంతాలకు చెందిన లారీలు ఆంధ్ర, మదరాసు రాష్ట్రాలలో తిరిగే సందర్భంలో రెండుసార్లు పన్ను విధించే ప్రమాదం తొలగుతుంది.

యీ రెండు పన్నుల విధానంపట్ల అసమ్మతి సూచకంగా చిత్తూరు లారీ యజమానుల సంఘంవారు జులైమొదటి తేదీ నుంచి సమ్మె చేస్తున్న విషయం పాఠకులకు తెలిసినదే.

ఇప్పుడు ఈ రెండు రాష్ట్రాలమధ్య ఈ విషయంలో ఒక ఏర్పాటు జరిగినందుకు హర్షం వెలిబుచ్చుతూ దీని ఫలితంగా రెండు పన్నులవిధానం రద్దవుతుందనీ, లారీ యజమానులకు దీనివల్ల సంతృప్తి కలుగుతుందని ఆశిస్తున్నా నని ఆంధ్ర కాంగ్రెసు సహాయ కార్యదర్శి శ్రీ పి. [illegible] ప్రకటన చేశారు. [illegible] ఏర్పాటు చేసినందుకు [illegible] ఆయన అభినందించారు.

# ఇక రాజధాని, హైకోర్టు వదలి మిగతా ముఖ్యవిషయాలపై దృష్టి కేంద్రీకరిద్దాం

## గుంటూరు పురపాలక సంఘ సన్మానం: ఆంధ్ర ఎం. పి., ఎం. ఎల్. ఏల సమాధానం

(స్వకీయ విలేఖరి)

గుంటూరు, జూలై 7: ఆంధ్ర హైకోర్టు ప్రారంభోత్సవమునకు ఆహ్వానితులుగా వచ్చిన ఆంధ్ర శాసనసభ పార్లమెంటు, సభ్యులకు నిన్న సాయంకాలం 'ఉల్ఫుహాలు'లో గుంటూరు పురపాలక సంఘంవారు తేనీటి విందు చేసి సన్మానించారు. సుమారు 30 మంది ఆంధ్రశాసన సభ్యులు. అయిదారుగురు పార్లమెంటు సభ్యులు యీ సన్మాన సభకు హాజరయినారు.

తేనీటి అనంతరం కృషికార్ లోక్ పార్టీ శాసనసభ్యులు శ్రీ సిరికొండ రామారావు అధ్యక్షతన సభ జరిగింది. శ్రీ నడింపల్లి వెంకటలక్ష్మీనరసింహారావుగారు యీ సభ ఉద్దేశమును వివరించి ఆంధ్ర హైకోర్టు అవతరణకు కృషి చేసినందులకు శాసనసభ్యు లందరిని అభినందించారు. తరువాత సభాధ్యక్షులు ఆంధ్ర హైకోర్టు విషయం శాసనసభలో చర్చకు వచ్చినపుడు జరిగిన ఉదంతం వివరించారు. శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు ఆంధ్ర రాజధాని, ఆంధ్ర హైకోర్టు సమస్యలు గత పది నెలలుగా శాసన సభ్యులను, అధికారులను ప్రజలను ఆందోళన పరిచినవనియు, విశాలాంధ్ర ఏర్పడినపుడు గాని యీ సమస్యలు శాశ్వతంగా సంతృప్తికరంగా పరిష్కరింప బడజాలవని అన్నారు.

శ్రీ సూర్యనారాయణ రాజుగారు, "ఆంధ్ర హైకోర్టు మద్రాసు నుండి వెంటనే తరల్చాలని అందరు ఏకగ్రీవంగా నిశ్చయించుకొన్నా ఎక్కడ స్థాపన చేయాలి అనే విషయంలో ప్రాంతీయ అభిమానాలు పొడచూపటం సహజమే. విశాఖ పట్టణంలో పెట్టాలని, గుంటూరులో ఏర్పాటు చేయాలని, రెండు అభిప్రాయాలు ప్రకటింప బడినవి. ఇక యిప్పుడు గుంటూరులో హైకోర్టు ప్రారంభింపబడినది కనుక ఆ విషయంలో యిక అభిప్రాయభేదాలకు తావివ్వకుండా మనం అంతా ప్రవర్తించుకోవాలి" అని విజ్ఞప్తి చేసి, గుంటూరులో హైకోర్టుకు ముఖ్యకారకులైన శ్రీ నడింపల్లి వెంకటలక్ష్మీనరసింహారావు వావిలాల గోపాలకృష్ణయ్యగార్లను అభినందించారు. ముఖ్యంగా శ్రీ నడింపల్లి వారు మంత్రి యుగంధరులవంటి వారని వారు పూనుకున్న కార్యము సాధించుటలో వారికన్న శక్తిసామర్థ్యాలు కలవారు అసెంబ్లీలో లేరనే అనిపిస్తుందని ప్రశంసించారు.

శ్రీ ముల్లపూడి రాజేశ్వరరావుగారు ప్రసంగిస్తూ యీ సభకు హాజరైన కాంగ్రెసు శాసనసభ్యుడు తానొక్కడే గావే కనిపిస్తుందనియు, అందువల్ల కాంగ్రెసు తరఫున యీ సభకు హాజరయినందులకు తామెంతో సంతోషిస్తున్నామన్నారు. కాంగ్రెసువారు గుంటూరులో హైకోర్టు నెలకొల్పటానికి విముఖులైనప్పటికి, తాము కాంగ్రెసులోవుంటే, గుంటూరు అంతటి తమకు ప్రత్యేక అభిమానముగాని, విశాఖపట్టణముంటే ప్రత్యేక దురభిమానముగాని తమకు లేనప్పటికి, అందరికి అందుబాటులోవున్న గుంటూరులోనే ఏర్పాటుచేస్తే బాగుంటుందని తాము అభిప్రాయపడ్డామన్నారు. కాంగ్రెసువారికి కూడ గుంటూరులో విజయవాడ ప్రాంతంమీద ప్రత్యేక దురభిమానమేమి లేదన్నారు. రాయలసీమ ప్రజలందరికి మనపై సంపూర్ణ విశ్వాసం కలిగించుకోవాలని విజ్ఞప్తిచేశారు.

శ్రీ సి. వి. కె. రావుగారు ప్రసంగిస్తూ హైకోర్టు గుంటూరులో ప్రారంభించినపుడు గుంటూరు ప్రజలుచూపిన ఆనందం ఒక్క గుంటూరువారిదే కాక ఆంధ్రప్రజలందరి దన్నారు. గుంటూరు ప్రజలు చూసిన అమితోత్సాహం హైకోర్టు కార్యక్రమానికి కొంత అంతరాయం కూడ కల్పించిందని పత్రికలవల్ల తెలుసుకొన్నామని కాని అది ఆనాడు ప్రజల అమితోత్సాహం వల్లనే కాని వేరే అపార్థం చేసుకోకూడదన్నారు. గత 10 నెలలుగా శాసనసభ్యులను కలవరపరచిన రెండును ప్రధాన సమస్యలు. రాజధాని హైకోర్టు నిన్నటితో తాత్కాలికంగా పరిష్కరింపబడ్డాయి కాబట్టి యిక ప్రజలు వీటిపై చర్చ, విమర్శ మాని యితర ప్రధాన ప్రజాసమస్యలపై దృష్టిమరల్చి వాటి సక్రమపరిష్కారానికి కృషిచేయవలసిందని హెచ్చరించారు.

శ్రీ యస్. వి. యల్. నరసింహారావుగారు (పార్లమెంటు సభ్యులు) ప్రసంగిస్తూ, రాయలసీమవారికి సర్కారుప్రజలపై అవిశ్వాసము కలుగుటకు కారణమేమీ లేదని, ఏ విషయాల్లో సర్కారుప్రజలు రాయలసీమ ప్రజలను అన్యాయం చేశామని ఏ రాయలసీమ సభ్యులైనావివరిస్తే సంతోషిస్తామన్నారు. సరిదిద్దు చేయలేనప్పుడు అనవసరంగా అనుమానం కలిగి, అవిశ్వాసం ప్రకటించుకోనటం సమంజసం కాదన్నారు. ఏకమైనా రాయలసీమప్రజలు, సర్కారుప్రజలవిశ్వాసం పెంచక యిరువురిని సర్కారుప్రజలనే వ్యవహరిస్తే యీ భేదాలు, క్షీదాభిప్రాయాలు, అవిశ్వాసాలు త్వరగా అంతరించగలవని తమ దృఢనమ్మకమని అన్నారు.

శ్రీ వి. చిదానందంగారు తమ ప్రసంగంలో ఆంధ్ర శాసనసభ్యులిక మహత్కార్యాలకు పూనుకోవాలని విజ్ఞప్తి చేశారు.

శ్రీ కొల్లా వెంకయ్యగారు తమ ప్రసంగంలో ఆంధ్ర హైకోర్టు స్థాపన విషయంలో ప్రజలు విజయాన్ని సాధించుకున్నారని అలాగే రాజధాని సమస్యకూడ నేడుకాకపోతే రేపన్నా సక్రమంగా పరిష్కరింపబడగలదని తమ గాఢవిశ్వాసాన్ని ప్రకటించి ప్రజలు శాసనసభ్యులు పూనుకొని అందరికి అందుబాటులో వుండేచోట రాజధానికూడ స్థాపించటానికి కృషి చేయాలి అన్నారు.

శ్రీ దర్శి లక్ష్మయ్యగారు తమ ప్రసంగంలో అనేకవిషయాల్లో ప్రభుత్వం ప్రజాభిప్రాయానికి వ్యతిరేకంగా వ్యవహరిస్తున్నదనియు, అటువంటిది యికముందు పూర్తిగా అరికట్టాలన్నారు.

పార్లమెంటు సభ్యులు శ్రీ ఎ. కృష్ణస్వామిగారు పార్లమెంటులో చర్చలను సింహావలోకనంచేసి వ్యక్తిగత పక్షాలలో భేదాభిప్రాయాలున్నప్పటికి ప్రధాన విషయాల్లో ఒక్కటిగా నిలచి ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడి. ఏకకంఠంతో ఆందోళన చేశామన్నారు. దక్షిణ భారత సమస్యల ప్రాముఖ్యతను ఆవశ్యకతను ప్రభుత్వ దృష్టికి తెచ్చుటకు తగినంత కృషి జరిగిందని అందువల్ల రెండవ పంచవర్ష ప్రణాళికలో దక్షిణ దేశంవారికి అన్యాయం జరుగనేరదని హామీ యిచ్చారు. దక్షిణదేశం వారంతా, ఆంధ్రులైనా, తమిళులైనా, కన్నడులైనా మళయాళీయులైనా, అందరు ఒక్కటిగా నిలచి నిర్భయంగా పోరాడి తమ సమస్యలు పరిష్కరించుకొనుటకు తీవ్రమైన కృషి చేయాలని విజ్ఞప్తిచేశారు.

గుంటూరు పురపాలక సంఘసభ్యులు శ్రీ కె. సీతారామయ్యగారు గుంటూరు పురపాలక సంఘముయొక్క ఆహ్వానము నాదరించి యీ సభకు విచ్చేసిన శాసనసభ్యులకు పార్లమెంటు సభ్యులకు గుంటూరు పురపాలక సంఘము తరఫున కృతజ్ఞతాభి పూర్వక వందనములు సమర్పించారు. హైకోర్టు స్థాపనవల్ల గుంటూరు పట్టణముయొక్క అవసరాలెంతో పెరిగినవనియు ఆ అవసరములు తీర్చుటకు గుంటూరు పురపాలక సంఘమువారు చేయు కృషికి ఆంధ్ర శాసన సభ్యులందరు సహకరించి తోడ్పడాలి అని విజ్ఞప్తి చేశారు.

## శాసనసభ, మంత్రి వర్గాలలో స్త్రీలకు సమాన స్థానాలు

### గిరిగారి హెచ్చరిక

సికింద్రాబాదు, జూలై 8: శాసన సభలలోనూ, మంత్రివర్గాలలోనూ చెరిసగం ప్రాతినిధ్యం ఇస్తామని హామీ ఇవ్వబడినప్పుడే రాబోయే ఎన్నికలలో స్త్రీలు ఓటుచెయ్యాలనీ, తాము మహిళా హక్కులను సాధించటానికై ఎన్నికల ఏజంటుగా పని చేస్తా మనీ కేంద్ర కార్మిక మంత్రి వి. వి. గిరిగారుఇవాళ ఇక్కడ ఒక సమావేశంలో వెల్లడించారు. ఈ సమావేశంలో చెదురుగా స్త్రీలు పాల్గొన్నారు.

ఆర్థికమంత్రిగా వారి భర్తలకన్నా స్త్రీలే తగిఉంటారని తాము భావిస్తున్నామన్నారు.

తమ నెలసరి సంపాదనలను భార్యలకు ఇస్తే, ఎంతో నేర్పుగా ఖర్చు చేయటం సరిపోతుం దన్నారు.

## ఆంధ్ర బార్ కౌన్సిల్

### ఆర్డినెన్సు అమలు జరపడానికి రాష్ట్రపతి ఆమోదం

కర్నూలు, జూలై 8: ఆంధ్రలో బార్ కౌన్సిలు రూపొందించడానికి అవసరమైన ఆర్డినెన్సు అమలు జరిపే విషయంలో ఆంధ్ర ప్రభుత్వం రాష్ట్రపతి ఆమోదాన్ని పొందినదని ఈ వేళ యిక్కడ గట్టిగా తెలిసింది.

ఈ ఆర్డినెన్సును ఆంధ్ర ప్రభుత్వం త్వరలో అమలుజరుప నున్నదని కూడా తెలిసింది.

మొట్ట మొదటిసారి బార్‌కౌన్సిల్ సభ్యుల ఎన్నికలు జరిపే బదులు సభ్యులను నామినేట్ చేస్తారు. ఈ విధంగా నామినేట్ చేయబడే సభ్యులు ఆరునెలలపాటు ఆ పదవిలో వుంటారు. బార్ కౌన్సిల్ నిర్మాణానికి అవసరమైన [illegible] కొంత ఆలస్యం అవుతుంది. కనుక ఇప్పుడు ప్రభుత్వం ఈ ఆర్డినెన్సును అమలుజరపనున్నది.

## రాజధానికి కేంద్ర హోమ్‌మంత్రి రాక

### ఉపముఖ్యమంత్రి ప్రభృతుల స్వాగతం

కర్నూలు, జూలై 8: కేంద్ర ప్రభుత్వ హోమ్ మంత్రి డాక్టరు కైలాస్‌నాథ్ కట్జూగారు ఈ వేళ మధ్యాహ్నం ఒంటిగంటన్నరకు బళ్లారినుంచి ఇక్కడికి వచ్చారు. రాష్ట్ర ప్రభుత్వం తరఫున ఉపముఖ్య మంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి, ఆంధ్ర ప్రభుత్వ ప్రధానకార్యదర్శి శ్రీ ఓ. పుల్లారెడ్డి, కర్నూలు జిల్లా కలెక్టరు శ్రీ జనాబ్ సయ్యాద్ అహమ్మద్ ప్రభృతులు కేంద్ర హోమ్‌మంత్రికి స్వాగతమిచ్చారు.

ఇక్కడికిరాగానే డాక్టరు కట్జూ ఉపముఖ్యమంత్రి సంజీవరెడ్డిగారిఇంట విందారగించారు.

విందుతరువాత, ఆంధ్ర ఆర్థిక మంత్రి శ్రీ విశ్వనాథంగారు, వెంటరాగా కేంద్రప్రభుత్వ హోమ్ మంత్రి ఆంధ్రప్రభుత్వ ప్రధానకార్యాలయానికి వెళ్ళారు. ఛీఫ్‌సెక్రటరియేట్ వద్ద ఆంధ్రప్రభుత్వ హోమ్‌శాఖ సహాయ కార్యదర్శి శ్రీ ఐ. జె. నాయుడుగారు డాక్టరు కట్జూగారికి స్వాగతమిచ్చారు.

సెక్రేటరియేట్ వద్ద బళ్ళారి ఆంధ్రులతరఫున శ్రీయుతులు పి. వి. సుబ్బారావ్, ఎన్. మృత్యుంజయశాస్త్రి, హెచ్. సీతారామిరెడ్డి, డి. వేణుగోపాలాచారి, అబుల్ బసీత్, ఎమ్. గంగప్ప, ఎమ్. దొడ్డ బసప్ప, ఎస్. రాజగోపాల చెట్టిగారలు కేంద్ర హోమ్‌మంత్రికి ఒక విజ్ఞప్తి సమర్పించారు.

బళ్ళారి పురపాలకసంఘాన్ని రద్దు చేయగోరుతూ మైసూరు ప్రభుత్వం నోటీసు ఇచ్చినవిషయాన్ని, బళ్ళారిలో మైసూరుప్రభుత్వం 144 వ సెక్షన్ అమలు జరిపిన విషయాన్ని ఆ విజ్ఞప్తిలో ప్రస్తావించారని తెలిసింది. బళ్ళారిని 'బి' తరగతి రాష్ట్రమైన మైసూరులో కలపడంవల్ల పరిపాలన ఇబ్బందిగా వున్నదనీ బళ్ళారిని మైసూరు కేవలం సాయుధ సైనికుల నివాసంగా మార్చివేస్తున్నదని కూడా ఈ రాయబార వర్గంవారు ఆ విజ్ఞప్తిలో వివరించినట్లుకూడా తెలిసింది.

ఆంధ్ర ప్రభుత్వం 'బి' క్యాంపు డేరాలలో ప్రభుత్వోద్యోగుల నివాసానికిగాను క్రొత్తగా కట్టించిన ఇంద్ర కాలనీని ఈవేళ మధ్యాహ్నం డాక్టరు కట్జూ చూస్తారు.

## క్షయ మలేరియాలను నిర్మూలించాలి

### ప్రజలకు కేంద్ర ఆరోగ్య మంత్రి విజ్ఞప్తి

బొంబాయి, జూలై 8: క్షయ, మలేరియా వంటి వ్యాధులను అరికట్టే నిమిత్తం ప్రజలంతా సహకరించి ఒకటిగా కృషిచేయాలని కేంద్ర ఆరోగ్య మంత్రిణి రాజకుమారి అమృతకౌర్ నేడు ఉద్బోధించింది.

ఇక్కడ, ఘట్కోపర్ దగ్గర, సర్వోదయ ఆస్పత్రి, శానిటోరియం భవనాలకు ప్రారంభోత్సవం చేస్తూ ఆమె ఈ హెచ్చరిక చేసింది.

"వ్యాధులను అరికట్టేందుకు ప్రభుత్వం చాతనయిందల్లా చేస్తునే ఉన్నది అయితే యీపని కేవలం ప్రభుత్వానిదేనన్నట్లు చూడకూడదు. యీప్రయత్నాలు నెరవేరాలంటే ప్రజల సహకారంకూడా చాలా అవసరం. ౩ లక్షలు ఖర్చుపెట్టి యీ ఆస్పత్రినీ, శానిటోరియంనీ నిర్మించిన నాయకులను మిగతా ప్రజలంతా కూడా అనుసరించ ప్రయత్నించాలి.

దేశంలో ఆరోగ్య పరిస్థితులు కొంత మెరుగ్గా ఉన్నప్పటికి చాలదు. ఇంకా లక్షల సంది జిడ్డలు క్షయవ్యాధికి బలి అవుతున్నారు. ప్రజారోగ్యానికి పెట్టవలసినంత డబ్బును ప్రభుత్వం ఖర్చుపెట్ట లేకపోతున్నది. ప్రస్తుతం ప్రజల ఆర్థికాభివృద్ధికి కోట్లకొద్దీ వినియోగించబడుతున్నది.

అయితే రెండో పంచవర్ష ప్రణాళికలో క్షయవ్యాధివంటి వ్యాధులను అరికట్టటానికి ఏర్పాట్లు ఉండగలవని ఆశిస్తున్నాను. ప్రజలకు ఉత్తమ ఆహారం, వస్త్రాలు, ఇళ్లు సమకూర్చేందుకు ఎక్కువ శ్రద్ధచూపబడుతుందని కూడా ఆశిస్తున్నాను" అని ఆమె అన్నది.

రాష్ట్రపతి రాజేన్‌బాబు ఈ సందర్భంలో ఒక సందేశాన్ని పంపుతూ, యీ ఆస్పత్రి, శానిటోరియంలు బొంబాయినగర [illegible] వచ్చినవి.

## 'తెలంగాణా మిగులు రాష్ట్రం కాగలదు'

### డాక్టరు చెన్నారెడ్డిగారి నివేదిక

హైదరాబాదు, జులై 7: హైదరాబాదు రాష్ట్రంలోని తెలుగుమాట్లాడే ప్రాంతాలతో యేర్పాటుచేయబడే తెలంగాణా రాష్ట్రం స్వశక్తిమీద ఆధారపడగలదని సుదీర్ఘ నివేదికలో హైదరాబాదు వ్యవసాయమంత్రి డాక్టరు ఎం. చెన్నారెడ్డిగారు ఫజల్ అలీ కమీషనుకు తెలియజేశారు.

తెలంగాణా రాష్ట్ర ఆదాయం 17 కోట్ల రూపాయలుఉంటే, ఖర్చు 15 కో. 70లక్షలు ఉంటుందనీ, అందువల్ల 130 లక్షల మిగులు ఏడాదికుండగలదని వివరించారు.

తెలంగాణా రాష్ట్ర ఆదాయాన్ని పెంచటానికి మంచి అవకాశాలున్నాయని వివరిస్తూ ఖర్చును విలువపెంపుదల, పారిశ్రామికవిద్యుచ్ఛక్తి, అభివృద్ధిపన్ను, అమ్మకాలపన్ను, వ్యవసాయ ఆదాయపన్నులవంటి వాటివల్ల పెరుగుదల ఉంటుందన్నారు.

రాష్ట్రంలోని పెక్కు తాలూకాలలో రీసెటల్మెంటు జరగలేదనీ, తెలంగాణాలోని 30 తాలూకాలలోనూ అదని పూర్తవుతే 80 లక్షల అదనపు ఆదాయం రాగలదని పేర్కొన్నారు.

ప్రథమ పంచవర్ష ప్రణాళిక ముగిసేటప్పటికి కొన్ని ప్రాజెక్టులు పూర్తి కావటంతోనూ, గండ్లుపడిన చెరువుల మరమ్మతులతోనూ 2 లక్షల 80 వేల ఎకరాలు సాగుక్రిందకు రాగలదనీ, తద్వారా భూమిశిస్తు ఆదాయం పెరగటం సాధ్యమనీ అన్నారు.

ఈనాముల రద్దుతో చెరువు పంట ప్రాంతంపై 'చెరువు సెస్సు', పెరగగలదన్నారు.

తెలంగాణాలో సాగయే భూమి పెరిగకొలదీ, అభివృద్ధి పన్ను, నజరానా సెస్సు (ఇంప్రూవ్‌మెంట్ సెస్సు), పెరగగలదన్న విషయం గత రెండు, మూడేళ్ళలో స్పష్టమైందన్నారు.

పోలీసుశాఖ ఖర్చు తగ్గించవచ్చునీ, కొన్ని అనవసరశాఖలను రద్దు చేయవచ్చునీ, మద్యనిషేధం అమలుపర్చినా, అనష్టాన్ని రెవిన్యూ, అమ్మకాలపన్ను, తదితర శాఖలద్వారా వచ్చే అదనపు ఆదాయంవల్ల భర్తీ చేయ వీలుందన్నారు.

తెలంగాణా రాష్ట్రంలో తల ఒకటికి దాదాపు 17 రూపాయలు ఆదాయం ఉంటే, ఆంధ్రలో 9.6 రూపాయలు మాత్రమేననీ, ఆర్థికదృష్ట్యా ఆంధ్రతో పోల్చిచూస్తే తెలంగాణా రాష్ట్రం మిగులురాష్ట్రం కాగలదనీ, ఆంధ్రరాష్ట్రం లోటురాష్ట్రమనీ వివరించారు.

## హైద్రాబాద్ నియోజక వర్గాల నిర్ణయం

(స్వకీయ విలేఖరి)

హైదరాబాదు, జులై 7: నియోజక వర్గాల నిర్ణాయక సంఘం 12వ తేదీన ఇక్కడ సమావేశమైనప్పుడు విజ్ఞప్తులను వింటారు.

ఇబ్రహీమ్ పట్నం పార్లమెంటు స్థానం రద్దు కాబడిందనీ, సికింద్రాబాద్‌కు ఒక సంయుక్త నియోజకవర్గం సృష్టించబడిందనీ, అందులో హైదరాబాద్, సికింద్రాబాద్ నగరాలు, మహబూబ్‌నగర్ మెదక్ నల్గొండ జిల్లాలు ఉండవచ్చునీ, కమీషన్ సహాయ సభ్యుడు శ్రీ హుడా తెలియజేశారు. ఇది వరకు నల్గొండకు సంయుక్త నియోజకవర్గం ఉండేది. అది ప్రస్తుతం ఏక సభ్య నియోజకవర్గం చేయబడుతుంది. మిగతా ప్రాంతాలు తదితర నియోజక వర్గాలలో చేర్చబడతాయి.

మహబూబ్‌నగర్, కరీమ్‌నగర్, నాందేడ్ సంయుక్త నియోజకవర్గాలలో మార్పేమీ ఉండదు. వస్తాగీ నియోజకవర్గం పేరు కొప్‌బాల్‌గా మార్చబడుతుంది. మహబూబాబాద్ సంయుక్త నియోజకవర్గం సృష్టించబడుతుంది.

హైదరాబాద్ భాషా ప్రాతిపదికగా విభజిస్తే, ఈ ప్రతిపాదనలు చిక్కులను తేవచ్చునీ, ఒక్కొక్క పార్లమెంటు నియోజకవర్గంలో మరో భాషా ప్రాంతం ఇప్పటికన్నా హెచ్చుగా ఉండగలదనీ వివరించారు.

శాసనసభా నియోజక వర్గాలు చిత్తు ప్రతిపాదనలు జిల్లాల వారీగా ఏర్పరచ బడ్డాయనీ, నిజామాబాద్, ఆదిలాబాద్ జిల్లాల అసెంబ్లీ స్థానాలు విడివిడిగా ఒకటి తగ్గించాలని ప్రతిపాదించ బడిందనీ, ఉస్మానాబాద్‌కు ఒక స్థానం పెంచబడిందనీ, వరంగల్లు జిల్లాను వరంగల్లు, ఖమ్మం జిల్లాలుగా విభజించటం వల్ల ఒక అసెంబ్లీ స్థానం పెరగగల దన్నారు.

[illegible] ఏకసభ్య నియోజకవర్గాల బదులు, రెండు సంయుక్త నియోజకవర్గాలుగా ఏర్పాటుచేయ ప్రతిపాదించబడిందనీ, సికింద్రాబాద్ సంయుక్త నియోజకవర్గానికి రెండు ఏక సభ్య నియోజక వర్గాలు ఏర్పరచబడ్డాయనీ అన్నారు.

సగటున 7 లక్షల 46 వేల 204 మందికి ఒక పార్లమెంటుస్థానం, 1 లక్ష 6 వేల 601 మందికి ఒక అసెంబ్లీస్థానం ఏర్పాటవుతుంది.

శ్రీ హూడా అభ్యర్థన మీద షెడ్యూల్డు తరగతులకు 29 స్థానాలు వచ్చాయి.

## హోమియో వైద్యం పట్ల ప్రభుత్వ వైఖరి

### గుంటూరు జిల్లా హోమియో వైద్యసభలో విమర్శ

రేపల్లె, జూలై 6: స్థానిక సంస్థలు హోమియో వైద్యశాలలను నిర్వహింపరాదనే యిదివరలి ఉత్తర్వులను వెంటనే ఉపసంహరించుకొని 2403 పి. హెచ్ 15-10-34 జి. ఒ. ప్రకారం స్థానిక సంస్థలు హోమియో వైద్యశాలలను నిర్వహించుటకు అనుమతిస్తు, అందులో వైద్యుల నియామకానికి 141 జి. ఒ. (15-1-52) ననుసరించి రిజిస్టరు చేయబడిన హోమియో వైద్యులకు కనీస అర్హతలు నిర్ణయించాలని రాష్ట్ర ప్రభుత్వాన్ని కోరుతూ, యీ నెల 2-వ తేదీన యిక్కడ జరిగిన గుంటూరు జిల్లా హోమియో వైద్య సమావేశంలో తీర్మానించారు.

జ్యా: సోమయ్య కమిటీ కార్యక్రమానికి ఉపక్రమించుటకు యింతవరకూ ఉత్తర్వులు యివ్వక పోవడం శోచనీయమని, యిప్పటికైనా ప్రభుత్వం ఆకమిటీకి ఉత్తర్వులు పంపాలని, యీ విషయమై, హోమియో వైద్యులు గట్టి కృషి చేయాలని కార్యదర్శి శ్రీ రంగాచార్యులు గారు హెచ్చరించారు.

యీ సమావేశం యిక్కడ కృష్ణా టాకీసులో, సంఘ అధ్యక్షులైన శ్రీ ఆర్. కె. రంగనాయకులు గారి అధ్యక్షతన జరిగింది. వివిధ తాలూకాల నుండి పలువురు ప్రతినిధులు సమావేశానికి హాజరైనారు. చర్చలలో, శ్రీయుతులు ముక్కెర రంగాచార్యులు, శారప రాజు కోదండ రామయ్య, నాగలింగం వెంకటేశ్వర శాస్త్రి, మాపతి శర్మగారలు పాల్గొన్నారు.

సంఘం తరఫున ప్రభుత్వానికి సమర్పించవలసిన నివేదికను కార్యదర్శికి ముక్కెర రంగాచార్యులు గారు తయారు చేసి సమర్పించగా సభవారు అంగీకరించి, ఆ నివేదికను త్వరలో ప్రభుత్వానికి పంపుటకు తీర్మానించారు.

ఆలిండియా రేడియో కార్యక్రమాలలో యితర వైద్యవిధానాలకు అవకాశమిస్తూ హోమియో వైద్య విధానానికి అలాంటి అవకాశమివ్వకుండా అవలంబించే పాక్షిక దృష్టిని విమర్శిస్తూ మరో తీర్మానం చేశారు.

### హానిమన్ వర్ధంతి సభ

హోమియో వైద్య సిద్ధాంత కర్త డా॥ హానిమన్ వర్ధంతి ఉత్సవం గుంటూరు జిల్లా హోమియో సంఘ అధ్వర్యాన, 2 వ తేదీ సాయంత్రం యిక్కడ కృష్ణా టాకీసులో జరుపబడింది. సభకు డా॥ భండిగ ఉమాపతి శర్మగారు అధ్యక్షత వహించారు. ప్రథమంలో సంఘం తరఫున కార్యదర్శి ముక్కెర రంగాచార్యులు గారు, ఆహ్వానితులకు స్వాగతం చెప్పారు. తరువాత గుడివాడ హోమియో కళాశాల ప్రిన్సిపాలు డా॥ గుర్రాజు గారు సభను ప్రారంభిస్తూ ప్రభుత్వం, జస్టిస్ సోమయ్య గారు లేనను, యింకొకర్ని కమిటీగా నియమించి ఆమోదం తెలుప వలసిందిగా కోరిందని, ఆమోదం తెలిపి 8 మాసాలైనా, యింత వరకు, కమిటీ కార్యక్రమాన్ని ఉపక్రమించుటకు ఉత్తర్వులు లేవని తెలియజేశారు.

వైద్య సంఘములలో విభేదాలు లేకుండా ఉండవలెనంటే, వైద్యమే వృత్తిగా అవలంబించినవారు ఒక సంఘం గాను, అభిమానులు, వైద్యులు మరొక సంఘంగాను, ఉండవచ్చునని అన్నారు. ప్రభుత్వం ఆమోదించిన కళాశాలలో శిక్షణ పొందని వైద్యుల విషయమై యింతవరకు ప్రభుత్వం వారు ఏ నిర్ణయానికి రాలేకుండా ఉన్నారని గుర్రాజు గారు అన్నారు.

జిల్లా సంఘాధ్యక్షులు శ్రీ ఆర్. కె. రంగనాయకులు గారు ప్రసంగిస్తూ ప్రభుత్వం ఆమోదించిన కళాశాలలు, వాటిలో శిక్షణ పొందినవారు కొద్ది అని, యితర కళాశాలల్లోనూ, ప్రైవేటుగాను వైద్యంలో శిక్షణ పొందిన వారు వేలాది ఉన్నారని నేటి హోమియో వైద్యం ఔన్నత్యానికి కారకులైన వారిని ప్రభుత్వం చిన్న చూపు చూచుట న్యాయం కాదని అన్నారు.

శ్రీయుతులు శారపరాజు కోదండ రామయ్య, టి. వి. ఎస్. పంతులు, కె. కామేశ్వరరావు గారలు గూడా ప్రసంగించారు.

అధ్యక్షులు మాట్లాడుతూ హోమియో వైద్యులు సంఘములు రెండు తరగతులుగా ఉండడంకంటె ఒకే తరగతిగా ఉండడం బాగుంటుందని సూచించారు. (స్వ. వి.)

## భాక్రానంగల్ ప్రాజెక్టు: నెహ్రూ ఉద్బోధ

(1 వ పేజీ తరువాయి)

పట్టుదలలో ఈ ప్రాజెక్టు నిర్మించబడ్డది.

### రాష్ట్రపతి సందేశం

రాష్ట్రపతి రాజేన్‌బాబు ఈ సందర్భంలో ఒక సందేశం పంపుతూ ఈ ప్రాజెక్టు నా యవ్వ భారతదేశంలో కొత్త శకాన్ని ప్రారంభిస్తున్నదన్నారు. ప్రాజెక్టునిర్మాణం జరుగుతున్న స్థానిక ప్రాంతానికి చెందిన పంజాబ్, పెప్సూ, రాజస్థాన్ ప్రజలు సట్లెజ్ నదీ జలాలు ఉపయోగించి తమ భూసారాన్ని అభివృద్ధిచేయగలవా

కేంద్ర హోంమంత్రి డాక్టరు కె. ఎన్. కట్జూకు విజయవాడలో ఛీఫ్ ఇంజనీర్ వెంకటకృష్ణయ్యర్ గారు కృష్ణా బారేజ్ కొత్త పథకాలను చూపించినప్పటి ఫోటో.

గుంటూరులో వైద్యకళాశాల కొత్తభవనాలను ప్రారంభించినప్పుడు ముఖ్యమంత్రి టి. ప్రకాశం పంతులుగారు ప్రసంగించినప్పటి దృశ్యం. మంత్రులు ఎస్. బి. పి. పట్టాభిరామారావు, డి. సంజీవయ్య గారలు హాజరైనారు.

## గ్రామ సేవా కార్యకర్తల శిక్షణ స్త్రీలకుకూడా ఇచ్చే ఏర్పాటు

న్యూఢిల్లీ, జూలై 7: దేశంలో ప్రస్తుతం వున్న జాతీయ వికాస కార్యక్రమ శిక్షణ కేంద్రాలలో స్త్రీలకు కూడా గ్రామస్థాయి కార్యకర్తలశిక్షణ ఇచ్చే ఏర్పాటు చేయటానికి భారత ప్రభుత్వం నిశ్చయించింది. అయితే స్త్రీలు చేయవలసిన పనులు పురుషులు చేయవలసిన వాటికి భిన్నంగానే వుంటాయి. వీరికి గృహశాస్త్రము, శిశు సంరక్షణ, ప్రసూతి, ఆరోగ్య పారిశుధ్య విషయాలకు సంబంధించిన అన్ని విషయాలూ నేర్పుతారు. ఇందుకు గాను వివిధ రాష్ట్రాలలో ప్రస్తుతం వున్న శిక్షణ కేంద్రాలలో 25 చోట్ల గృహార్థిక శాఖలు నెలకొల్పటానికి ప్రభుత్వం తలపెట్టింది.

ఈ స్కీము ననుసరించి ప్రధాన బోధకులకు 7 మాసాలపాటు శిక్షణ ఇప్పిస్తారు. ఆ శిక్షణ ఈ విధంగా వుంటుంది. అలహాబాదులో ఒక మాసం ప్రాథమిక శిక్షణ. జపానులో 2 మాసాల పర్యటన తర్వాత 4 మాసాలు భారత దేశంలో శిక్షణ, ఇది ఈయేడు ఆగస్టు 15-వ ప్రారంభిస్తారు. గృహార్థిక శాఖల ఏర్పాటు1955ఏప్రిల్ లో జరుగుతుంది. ప్రధాన బోధకుల శిక్షణ పొందేందుకు ఈనెల 15-లోగా యోగ్యులయిన స్త్రీల పేర్లను పంపవలసిందిగా రాష్ట్రప్రభుత్వాలను కోరారు. గృహార్థిక శాస్త్రంలో విశ్వవిద్యాలయపట్టం పొంది వుండటము, మంచి ఆరోగ్యం, విద్యా బోధన, రోగిపరి చర్య, సంఘ సేవలలో అనుభవము కలిగివుండటము. కుట్టు పనులు మొదలైనవి తెలిసివుండటము ఇందుకు యోగ్యతలు. రాష్ట్ర ప్రభుత్వాలు సిఫార్సుచేసిన వారిని కేంద్ర నిర్ణయసంఘం ఆమోదించవలసి వుంటుంది.

శిక్షణ కేంద్రాలలో గృహార్థికశాఖలు నెలకొల్పాక ఒక్కొక్కచోట 15 మంది స్త్రీలకు గ్రామసేవా కార్యక్రమంలో శిక్షణ ఇస్తారు. శిక్షణ కేంద్రం సమీపంలోని అభివృద్ధి కేంద్రంలో పనిచేసే కార్యకర్తలు అయినవారి భార్యలకు కూడా ఈ శిక్షణ ఇప్పిస్తారు. ఈ శిక్షితులందరికీ శిక్షణాకాలం 18 మాసాలూ నెలకు రూ 50/-లు స్టైపెండు ఇస్తారు.

### కెనడా విదేశాంగ మంత్రితో మీనన్ సమాలోచన

న్యూయార్క్, జులై 7: సమితిలో భారత ప్రతినిధివర్గ నాయకుడు కృష్ణ మీనన్ కెనడా విదేశాంగమంత్రి పియర్సన్‌తో సంప్రదించేనిమిత్తం నేడు కెనడాకు బయలుదేరారు.

అని ఎదురు చూచారనీ, ఈనాడు వారి కోరిక సఫలమయి, సంపన్న యుగం ప్రారంభమయిందనీ అన్నారు. ప్రాజెక్టు నిర్మాతలను అభినందించారు.

ఉపాధ్యక్షుడు డా॥ రాధాకృష్ణన్, పంజాబ్ మాజీ గవర్నరు త్రివేది కేంద్ర మంత్రులు ... మాజీ అధ్యక్షుడు, ప్రస్తుతం ఆంధ్ర గవర్నరు అయిన చందూలాల్ త్రివేదీ, పెప్సూ రాజప్రముఖ్ గార్లు సందేశాలను పంపించారు.

## సింహళ రాజ్యాంగ సవరణలు

### భారత హైకమిషనర్ హెచ్చరిక

కొలంబో, జూలై 7: సింహళ ప్రభుత్వం రాజ్యాంగంలో చేస్తున్న సవరణలు భారత సింహళ దేశాల ఒప్పందాన్ని అనుసరించి వుండక పోయేటట్లయితే భారతీయులు ఆ ఒప్పందం ఎందుకూ కొరగాకుండా పోయినట్లు భావిస్తారని ఇక్కడి భారత హైకమిషనరు సి. సి. దేశాయి ఇవ్వాళ అన్నారు.

ఆ ఒప్పందం ప్రకారం సింహళ పౌరులుగా నమోదు అయే భారతీయ సంతతివారికి ప్రత్యేక నియోజకస్థానాలు 10 ఏండ్ల పాటు వుండాలనీ, ఇప్పుడు సింహళ ప్రభుత్వం ప్రతిపాదించిన సవరణ చూస్తే ఆ కాలాన్ని ఇంకా పొడిగించ తలచినట్లున్నదనీ ఇది ఒప్పందానికి విరుద్ధమనీ దేశాయ్ అన్నారు.

దేశాయ్ ప్రకటన సింహళ రాజకీయవర్గాలలో సంచలనం కలగచేసింది.

### భూములక్రయంపై నిర్బంధాలు

సింహళంలో ఇతర దేశీయులు భూములు కొనరాదని నిషేధిస్తూ శాసనం చేయాలని ప్రభుత్వానికి ఈవిషయమై ఏర్పాటైన సలహాసంఘం సూత్రప్రాయంగా అంగీకరించింది.

ఈ రాత్రి సింహళ ప్రతినిధుల సభలో అన్ని పక్షాల వారుకూడా దేశాయ్ ఈ అభిప్రాయం వెల్లడించినందుకు నిరసన అసమ్మతి తెలిపారు. ప్రధాని కొతేలవల తాము దేశాయిగానీ, ఆయన దేశాయిగానీ వారి ఇష్టం వచ్చినట్లు తమదేశాన్ని ఆడించటాన్ని తాము సహించజాలమన్నారు.

## రెండవ ప్రణాళికలో కోళ్ల పరిశ్రమకు స్థానం

### కోడిపిల్లల దిగుమతికి కేంద్ర పథకం

న్యూఢిల్లీ, జూలై 7: రెండవ పంచవర్ష ప్రణాళికలో పెంపుడు పక్షుల పరిశ్రమ అభివృద్ధి కార్యక్రమాలను చేర్చే నిమిత్తం కేంద్ర ప్రభుత్వం ఆహార, వ్యవసాయ శాఖవారు ఒక పథకం తయారు చేశారు. దీన్ని అమలుజరపడానికి 70 లక్షల రూ. ఖర్చు అవుతుంది.

ఈ పథకాన్ని అమలు చేయడానికి ముందుగా దేశంలోని వివిధ ప్రాంతాలకు చెందిన 15 కేంద్రాలలో ప్రారంభ పథకాలు అమలుచేస్తారు.

ఈ చిన్న పథకాలలోనూ, ప్రధాన పథకంలోనూ కూడా విదేశాల నుంచి కోడి పిలలను దిగుమతి చేయడానికి యేర్పాట్లు పొందుపరిచారు.

దిగుమతి అయిన కోడిపిల్లలను ప్రభుత్వం నిర్వహిస్తున్న పెంపుడు పక్షుల కేంద్రాలలో 6 మాసాల వయసువచ్చే వరకూ పెంచి, ఆ తరువాత వివిధ ప్రాంతాలకు పంచిపెడతారు.

ఈ పరిశ్రమకు సంబంధించే అభివృద్ధి క్షేత్రాల ద్వారా ఈ పంపకం జరుగుతుంది.

కోళ్ళ పరిశ్రమకు అనువైన ప్రాంతాలలోనే ఈ అభివృద్ధి క్షేత్రాలు యేర్పరచబడుతాయి. వీలైనంతవరకూ, కమ్యూనిటీ ప్రాజెక్టులూ, జాతీయవిస్తరణ ప్రణాళికలూ అమలు జరుగుతున్న ప్రాంతాలలోనే వీటిని ఏర్పాటు చేయడం జరుగుతుంది.

ఈ పరిశ్రమ అభివృద్ధికి అమలుజరిపే ప్రారంభ పథకాలు హైదరాబాదు మద్రాసు మైసూరు, తిరువాన్కూరు-కొచ్చి, అస్సాం, బీహార్, మధ్యభారత్, మధ్యప్రదేశ్, పంజాబ్ పశ్చిమ బెంగాల్ రాష్ట్రాలలో ఒక్కొక్కటి చొప్పునా, బొంబాయి, ఉత్తర ప్రదేశ్ రాష్ట్రాలలో రెండేసిచొప్పునా అమలు జరుపడానికి ప్రభుత్వం ఉద్దేశిస్తున్నది.

## రెండు సంవత్సరాలలో రైళ్లలో కొత్త టపా పెట్టెలు

(ఆంధ్రపత్రిక విలేఖరి)

న్యూఢిల్లీ, జూలై 7: దేశంలో పోస్టు ఎక్కువ అయిన కారణంగా ఇప్పుడు రైళ్ళకు తగిలిస్తున్న పోస్టులు పెట్టెలు సరిపోకపోతున్నందు వల్ల రైల్వేశాఖ వారు ఇటువంటి పెట్టెలను నిర్మించడానికి పూనుకుంటున్నారు.

వచ్చే రెండు ఏండ్లలోను వీటి నిర్మాణం పూర్తి అవుతుంది. ఇందు నిమిత్తం 69 లక్షలు 40 వేల రూపాయలు ఖర్చు అవుతుందని అంచనా వేస్తున్నారు.

ఈ కొత్త పోస్టల్ పెట్టెల్లో కుషన్ సర్వీలు, ఫ్లోరసెంట్ దీపాలు, ఫానులు, స్నానాల సంపులు, దుంన్లు వేసు కునేందుకు చిన్నచిన్నకొయ్యలు, అన్నీ వుంటాయి.

పెద్ద రైళ్ళలో ఎయిర్-కండిషన్ చేసిన పెట్టెలను వెయ్యాలని కూడా ఆలోచనలు జరుగుతున్నాయి. ఇట్టి పెట్టెను ఒక్కొక్కదాన్ని నిర్మించడానికి లక్షరూపాయలు అవుతుందట.

### స్పెన్సర్స్, కెల్‌నర్స్

రైళ్ళలో భోజన సదుపాయాలు అవ్వ చేకూరుస్తూవుంటే తెల్లకం పెనీలు స్పెన్సర్స్, కెల్‌వర్స్, రైలుస్టేషనుల లో రెస్టారెంట్లకు సంబంధించిన కాంట్రాక్టులను వదులుకుంటున్నారు. అయితే, రైళ్లలో మాత్రం భోజన సదుపాయాలు చేస్తూవుంటారు. మద్యనిషేధం అమలుజరపడంవల్ల వీరికి భాగా నష్టం వస్తోందట.

## ఆంధ్రలో అసాధారణ పరిస్థితుల పరిశీలన

### తన పర్యటన ఉద్దేశాలను గురించిశ్రీమెహతా వివరణ

కర్నూలు, జూలై 8. ఈ వేళ ఉదయం ఇక్కడ జరిగిన పత్రికావిలేఖరుల గోష్ఠిలో ప్రసంగిస్తూ ఆంధ్రలో పరిస్థితి 'అసామాన్యం గా' ఉన్నదని అఖిలభారత కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి శ్రీ బల్వంతరాయ్ మెహతా అన్నారు.

ఉపముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవ రెడ్డిగారి నివాసంలో జరిగిన ఈ పత్రికా విలేఖరుల సమావేశంలో శ్రీ మెహతా ఇంకా యిలా అన్నారు:

"ఆంధ్రలో పరిస్థితి మామూలుగా లేదు. ఏ ఒక్క పార్టీకి మెజారిటీబలం లేదు. కనుక ప్రభుత్వాన్ని బలపరచడానికి గాను కొన్ని గ్రూపులవారు కాంగ్రెసుపార్టీతో కలిశారు. ఆంధ్రలో పరిస్థితి ఎప్పుడూ స్పష్టంగా అసందిగ్ధంగా వుండడంలేదు. ఇట్టి పరిస్థితిలో ఎప్పుడువచ్చే సమస్యలను అప్పుడు గ్రహిస్తూ చాలా జాగ్రత్తగా వ్యవహరించవలసి ఉంటుంది. కఠినమైన కార్యవిధానం అవలంబించడం సాధ్యం కాదు. ఇట్టి పరిస్థితికి అంటిపెట్టుకొని ఉండడం వాంఛనీయమవునో కాదో ప్రజలే నిర్ణయించాలి.

ఈ సున్నిత పరిస్థితినుంచి బయటపడడానికి గాను ఎన్నికలు జరిపించడం వాంఛనీయం కాదా అని ఒక విలేఖరి ప్రశ్నించగా అఖిలభారత కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి ఇలా అన్నారు:

"ఈ విషయంగురించి నేనేమీ చెప్పలేను. రోజు రోజుకూ ఏర్పడే స్థానిక పరిణామాలపై ఈ విషయం ఆధారపడి ఉంటుంది. ఈ విషయంలో దోవ చూపించవలసింది ప్రదేశ్ కాంగ్రెసు. ఎప్పటికి అప్పుడు యేర్పడే పరిణామాల మంచి చెడులను నిర్ణయించడానికి నేను చాలా దూరంగా వుంటున్నాను. పరిస్థితులను పరిశీలించడానికే నేను ఆంధ్రలో పర్యటిస్తున్నాను. ఇంకా కొన్ని రోజులవరకూ ఈ పరిశీలన పూర్తి కాకపోవచ్చు. నేను పరిశీలించే విషయాలలో కాంగ్రెసు బలమెంతి అనేదొకటి.

"ఆంధ్రలో కాంగ్రెసుపార్టీ బలమే కాక ఇతర పార్టీలలో యే పార్టీకి ఎంత బలం ఉన్నది? ప్రభుత్వం ఎలా పని చేస్తున్నది? ప్రభుత్వానికీ, ప్రభుత్వాన్ని బలపరిచే పార్టీలకూ మధ్య ఎట్టి సంబంధాలున్నవి? అనే విషయాలన్నింటినీ నాకు నేనే స్వయంగా తెలుసుకోనగోరుతున్నాను. ఈ పర్యటనలో ఈ అంశాలన్నింటినీ పరిశీలిస్తాను. ఇట్టి పరిస్థితులలో ఆంధ్రలో ప్రభుత్వానికీ, ప్రభుత్వాన్ని బలపరిచే పార్టీలకు మధ్యనున్న సంబంధాలు సాఫీగావుండే అవకాశం లేదు. కనుక ఇతర ప్రాంతాలలోకంటె ఇక్కడ ప్రభుత్వానికీ, ప్రభుత్వాన్ని బలపరిచే పార్టీలకూ మధ్య వింతసంబంధం వుంటుంది."

"సంఖ్యాబలం దృష్టితో చూచినా, కాంగ్రెసు పార్టీలో చేరినవారి శక్తి సామర్థ్యాలదృష్టితో చూచినా కాంగ్రెసు పార్టీ బలం అంత మిన్నగానూ లేదు; హీనంగానూ లేదు. పరిస్థితి పూర్వం ఎలావున్నదో ఇప్పుడు అదేవిధంగా ఉన్నది. కాకపోతే దేశంలో వచ్చిన పరిణామాల కారణంగా చిన్న చిన్న మార్పులువచ్చినవి. కొత్తపరిస్థితికి అనుగుణంగా సర్దుకోవడానికి కొంతకాలం పడుతుంది. పరిస్థితులకు అనుగుణంగా సర్దుకోవడానికి వారు యత్నిస్తున్నారు. కేంద్రం లోనూ, చాలా రాష్ట్రాలలోనూ పరిపాలనా నిర్వహణబాధ్యత ను వోటర్లు కాంగ్రెసుకు ఒప్పగించారు.

"తనబాధ్యత కాంగ్రెసుకు పూర్తిగా తెలుసు. పరిస్థితిని ఎప్పటికప్పుడు సమీక్షించడానికి కేంద్రంలో ఒక సంస్థఉన్నది. ప్రజలలో ఇప్పుడు చైతన్యంఉన్నది. నిర్మాణాత్మక విమర్శలు వస్తున్నవి. పరిస్థితులను ప్రజలు సమగ్రంగా తెలుసుకొంటున్నారు. వీటిని ప్రభుత్వం ఉపయుక్తంగా వాడుకోవచ్చు. ప్రతిపక్షం ఉన్నది కనుకనే కాంగ్రెసు ఉత్సాహంతో పని చేస్తున్నదని భావించరాదు. ఈ రాష్ట్రంలో ఎన్నికలు జరిగేముందు కాంగ్రెసు పార్టీ వివిధ పక్షాలుగా చీలిపోయింది. అందువల్ల ప్రజలకు కర్తవ్యం స్పష్టంగా కనిపించలేదు. కాంగ్రెసు పార్టీ ఇతర గ్రూపులకూ సిద్ధాంతరీత్యా ఎక్కువ తేడాలున్నవని నేను భావించడంలేదు.

అతరువాత విజిలెంకరూ కోటి కరూగా వుంటూ దేశానికి ఉపయోగకరమైన స్పష్టమైనదోవ చూపించడం వల్ల ప్రజలకు మేలు కలుగుతుందేమో ఆలోచించవలసిందిగా శ్రీ మెహతా కాంగ్రెసు నాయకులను విజ్ఞప్తి చేశారు.

కాంగ్రెసు నుండి బయటికివెళ్ళిన శ్రీ టంగుటూరి ప్రకాశం పి. తిమ్మారెడ్డి ప్రభృతులకూ తిరిగి కాంగ్రెసులోకి రావలసిందిగా ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుడు లోగడ ఆహ్వానించిన తరువాత ఆవిషయం గురించి ఇంకా యేమైనా చర్యలు తీసుకొన్నారాఅని ప్రశ్నించగా అట్టి ఆహ్వానం సంగతి తనకేమీ తెలియదని ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడు ఏ పరిస్థితులలో అలా ఆహ్వానించారో తనకు తెలియదనీ ఈవిషయం గురించి ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుణ్ణే అడిగితే బాగుంటుందనీ శ్రీ మెహతా చెప్పారు.

## మైసూరు రాష్ట్ర విభజన

### ప్రభుత్వం అంగీకరించదని ముఖ్యమంత్రి ప్రకటన

బెంగుళూరు, జూలై 8: ఏ పరిస్థితిలోనూ కూడా రాష్ట్రాన్ని భాషా ప్రాతిపదికగా విభజించటానికి మైసూరు ప్రభుత్వం అంగీకరించదని మైసూరు ముఖ్యమంత్రి కె. హనుమంతయ్య గారు ప్రకటించారు.

ముఖ్యమంత్రి పత్రికా ప్రపతినిధులతో మాటాడుతూ గతనెలలో కాంగ్రెసు శాసనసభాపార్టీ ఏకగ్రీవంగా ఆమోదించిన తీర్మానంలో రాష్ట్రం విచ్ఛిన్నం కారాదని స్పష్టీకరించబడిందన్నారు.

బెంగుళూరులో జేసవి పార్లమెంటు సమావేశాలనుగురించి ప్రస్తావించగా ఈ విషయంలో తమకు ఎట్టి సమాచారం రాలేదనీ, ప్రధాన మంత్రిగానీ, మరొక కేంద్ర మంత్రిగానీ నోటి మాటగాగానీ, వ్రాత పూర్వకంగా గానీ తమకేమీ తెలపలేదనీ వివరించారు.

బెంగుళూరు పార్లమెంటు సమావేశం జరుగుతుందని ఉబ్బి తబ్బిబ్బయినా చాలా ఇబ్బందులున్నాయన్నారు. 700 మంది సభ్యులకు విడుదులు ఏర్పాటు, దాదాపు 30 మంది మంత్రులకు వసతి సౌకర్యాలు, పార్లమెంటు సెక్రెటేరియట్ సిబ్బంది, కార్యాలయానికి ఏర్పాట్లు వంటివన్నిటిని గురించి ముందు ఆలోచించుకోవాలన్నారు. కొత్తగా నిర్మించబడే శాసనసభా భవనాలు ఉభయ పార్లమెంటు సమావేశాలకు సరిపోతుందనుకున్నా, అవసరాల నన్నిటినీ అదివనం తీర్చలేదని పేర్కొన్నారు.

## రెండవ పంచవర్ష ప్రణాళిక

### కాంగ్రెసు వాదులకు ఆదేశం

కర్నూలు, జూలై 8: రెండవ పంచవర్షప్రణాళికను రూపొందించే విషయంలో ప్రత్యేకశ్రద్ధ వహించవలసిందిగా కాంగ్రెసువాదులకు అఖిలభారత కాంగ్రెసు సూచించిందనీ, రెండవ పంచవర్షప్రణాళిక నిజంగా ప్రజల ప్రణాళికగా ఉండాలని కాంగ్రెసు కోరుతున్నదనీ అఖిలభారతకాంగ్రెసు ప్రధానకార్యదర్శి శ్రీ బల్వంతరాయ్ మెహతా ఈవేళ ఇక్కడ అన్నారు. ఈ విషయంగురించి ఆయన ఇంకా యిలా చెప్పారు:

"పంచవర్షప్రణాళికను అమలుజరిపే విషయంలో ప్రత్యేక శ్రద్ధాసక్తులు చూపించవలసిందిగా అనేకసార్లు కాంగ్రెసు వాదులకు సూచించాము. రెండవపంచవర్షప్రణాళికను రూపొందించే విషయంలో ప్రత్యేక శ్రద్ధ వహించవలసిందిగా కాంగ్రెసు వాదులను ప్రత్యేకంగా కోరాము. రెండవ పంచవర్షప్రణాళిక నిజంగా ప్రజల ప్రణాళికగా రూపొందించబడాలని కాంగ్రెసు కోరుతున్నది. మొదటి పంచవర్షప్రణాళికను రూపొందించేటప్పుడు అట్టి అవకాశం లేకపోయింది. కనుక ప్రణాళికను తయారుచేయడంలో ఉపయోగకరమైన సూచనలు చేసే విషయంలో ప్రజలను ఉత్సాహపరచవలసిందిగా కాంగ్రెసు వాదులను కోరాము. ఈ మహత్తర కార్యక్రమంలో ప్రజలను వినియోగించవలసి ఉన్నది. ఇందుకు గాను ప్లానింగ్ కమిషన్ స్థానికంగా నెలకొల్పనున్న ఉద్యోగులతో సన్నిహిత సంబంధాలు నేర్పరచుకోవలసిందిగా వారికి సలహా లిస్తాము."

### జమీందారీల రద్దు-అదనపు అడ్వాన్సుల నష్టపరిహారము

కర్నూలు, జూలై 2: కడప జిల్లాలో నోటిఫై చేయబడిన పతిమాపురం, నాకి నేనిపల్లి యీనాం యస్టేట్ల సందర్భంలో అదనపు అడ్వాన్సు నష్టపరిహారాన్ని చిత్తూరు జమీందారీల రద్దు ట్రిబ్యునల్ వద్ద 11-6-54 న ప్రభుత్వం తరఫున డిపాజిటు చేసినట్లు సెటిల్మెంట్ల డైరెక్టరు ప్రకటిస్తున్నారు. వివరాలు దిగువ యివ్వబడినవి.

నోటిఫైడ్ తేంటరు- పతిమాపురం 95, నాకి నేనిపల్లి 104. మొదట డిపాజిటు చేసిన అడ్వాన్సు నష్టపరిహారం- పతిమాపురం రు. 29,074, నాకి నేనిపల్లి రూ. 14,662, డిపాజిటు చేసిన తేదీ (రెండిటికీ) 21-3-52. ఇప్పుడు మళ్లీ చేసిన డిపాజిటు. పతిమాపురం రూ. 5,920, నాకి నేనిపల్లి రూ. 4185 ఇంతవరకూ డిపాజిటు చేసిన మొత్తం- పతిమాపురం రూ. 34,994, నాకి నేనిపల్లి రూ. 18,848.

అడ్వాన్సు నష్టపరిహారం పునర్నిమర్శింపబడినందున యీవిధంగా అదనపు డిపాజిటు చెయవలసి వచ్చింది.

### సారా దగ్గర ఉంచు కొన్నందుకు నెల శిక్ష

గడ్డికోమలంక కాపురస్థులు, దాసరి అంకయ్య, బొర్రా వెంకటేశ్వర్లు అనువారలు, తమవద్ద కొపుసారా ఉంచుకొన్నారనే నేరారోపణపై పోలీసువారు అరెస్టుచేశారు. వారికి, తెనాలి ఎడిషనల్ ఫస్టుక్లాసు మేజిస్ట్రేటు శ్రీ కె. అంకయ్య నాయుడు గారు, తలా ఒక నెలరోజులు కఠిన శిక్ష విధించారు.

## ఏకైక ప్రపంచ వ్యవస్థా నిర్మాణం

### సుసాధ్యమేనని గిరిగారి ఉద్ఘాటన

సికింద్రాబాదు, జూలై 8: "ప్రపంచమంతా ఒక రాజ్యంగా ఏర్పాటు చేయటం కచ్చితంగా సాధ్యమైన విషయమే. భారత ప్రధానమంత్రి నెహ్రూవంటి జాతీయ నాయకుల ప్రయత్నాలు త్వరితంగా లక్ష్యసాధనకు దోహదం చేస్తాయి" కేంద్ర కార్మిక శాఖామంత్రి వి. వి. గిరిగారు గతరాత్రి ఇక్కడ ఉద్ఘాటించారు.

హైదరాబాద్ రోటరీక్లబ్‌లో మాట్లాడుతూ ఐక్యరాజ్య సమితి సభ్యులు ధనికులైనా, లేదా బీదవారైనా, లేదా బలహీనులైనా, లేదా బలవంతులైనా ప్రపంచంలోని ప్రతిజాతికీ సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని చేకూరుస్తామని ప్రకటించాలన్నారు.

ఏ జాతైనా మరో రాజ్యానికి చెందిన భూభాగాన్ని కలుపుకో ప్రయత్నిస్తే, మిగతా జాతులన్నీ ఆ దురాక్రమణను అరికట్టాలనీ, దేశంలో శాంతిని నెలకొల్పటానికి కావలసిన సైనిక, ఆయుధబలంకన్నా ఎక్కువగా ఏ దేశం కలిగి ఉండరాదనీ అన్నారు.

తమవద్దనున్న ఆయుధాలు, మందుగుండు సామగ్రి, యుద్ధ ఓడలు అన్ని దేశాలు ఐక్యరాజ్య సమితికి విధిగా అప్పగించాలనీ, తద్వారా ఒక అంతర్జాతీయ సైన్యాన్ని, నౌకాదళాన్ని, వైమానికదళాన్ని నిర్మించి, ప్రపంచ శాంతి సంరక్షణ దోహదం చెయ్యాలనీ వివరించారు. ఏ దేశం కూడా మరో దేశంపై దురాక్రమణ చర్యకు పూనుకోరాదన్నారు.

మహాత్మాగాంధీ మరి కొన్నేళ్ళ పాటు జీవించి ఉంటే, అన్ని బానిస రాజ్యాలకూ స్వాతంత్ర్యాన్ని సమకూర్చి, ప్రపంచ శాంతిస్థాపనకు తమ యావచ్ఛక్తిని ధారపోస్తున్న పండిట్ నెహ్రూ వంటి నాయకునితో 'ప్రపంచ రాజ్యాన్ని' స్థాపించి ఉండేవారని పేర్కొన్నారు.

స్త్రీలకు శాసనసభలలో, కేంద్ర, రాష్ట్రమంత్రివర్గాలలో పురుషులతో పాటు సమాన ప్రాతినిధ్యాన్ని కలిగించాలనీ, రాబోయే ఎన్నికలలో వారికి గల సంఖ్యాబలంలో శాసన సభలలో, కేంద్ర రాష్ట్రమంత్రివర్గాలలో నూటికి యాభైవంతుల ప్రాతినిధ్యాన్ని సంపాదించటం తథ్యమని గిరిగారు ఆశాభావాన్ని వ్యక్తపరిచారు.

### ఆగస్టునాటికి గోవధ నిషేధించకపోతే సత్యాగ్రహం

అహమదాబాదు, జూలై 8: వచ్చే ఆగస్టు 31 వ తేదీ జన్మాష్టమి నాటికి దేశంలో గోవధ నిషేధించబడకపోతే, రామరాజ్య పరిషత్తు, దేశంలోని 5 ముఖ్యనగరాలలో సత్యాగ్రహం జరుపుతుందని పరిషదధ్యక్షుడు స్వామికరపత్రజీనిన్నరాత్రి ఒకప్రకటన చేశారు. ఈ సత్యాగ్రహం శాంతి యుతమైనది గానూ, అహింసాత్మకంగా ఉంటుందని ఆయన చెప్పారు.

అహమదాబాద్ బొంబాయి, కలకత్తా, ఢిల్లీ, మధుర నగరాలలో ఇది ఒకేసారి ప్రారంభించబడుతుంది.

ఢిల్లీలో ప్రధాని నెహ్రూ నివాస గృహం ఎదుట శాంతియుతంగా జరపబడుతుందని ఆయన అన్నారు.

## సత్తెనపల్లి హిందూ హైస్కూలు

### రికగ్నైజు చేస్తూ ప్రభుత్వ ఉత్తర్వు

గుంటూరు, జులై 7: సత్తెనపల్లి శరభయ్యగుప్త హిందు హైస్కూలుకు 1954-55 సంవత్సరానికి ప్రభుత్వం రికగ్నిషన్ ఇస్తూ ఉత్తరువులు చేసింది. ఈ స్కూలు పాలక సంఘాన్ని 8 మంది సభ్యులతో తిరిగి ఏర్పాటు చేయాలని, అందులో పలుగురు దాతవంశీయులు, ఒకరు జిల్లాబోర్డు ప్రతినిధి, ఒకరు పంచాయతీబోర్డు ప్రతినిధి, ఇద్దరు స్థానిక ఉద్యోగులనుంచి తీసుకోబడిన ప్రతినిధులు ఉండాలని ఉత్తరువులు చేయబడ్డాయి. (స్వ. వి.)

### శ్రీకాకుళం జిల్లా కాంగ్రెసు

శ్రీకాకుళం, జులై 6: ఈ జిల్లా కాంగ్రెసు సర్వసభ్య సమావేశం, యిది వరలో ప్రకటించినట్లు శ్రీకాకుళంలో గాక, విజయనగరం కాంగ్రెసు ఆఫీసులో జరుగుతుందని, బల్వంత్ రాయ్ మెహతా కార్యక్రమంలో మార్పువల్ల సమావేశంలో గూడా మార్పు చేయవలసి వచ్చిందని అధ్యక్షులు కోటగిరి సీతారామస్వామి గారు తెలుపుతున్నారు.

### సంస్కృతభాషాప్రచారిణీ సభ పరీక్షలు

చిత్తూరు, జులై 6: చిత్తూరు సంస్కృత భాషా ప్రచారిణీ వారిచే జరుపబడు పరీక్షలు, యీ సం॥ రం సెప్టెంబరు 4, 5 తేదీలలో జరుగును. పరీక్షార్థులు, దరఖాస్తు పత్రములు, సల్కములు జూలై 20 తేదీలోగాను, ఆలస్యమైనచో దరఖాస్తు 0-8-0 అదనంగాకట్టి జూలై 30 తేదీ లోగా ను పంపుకోవచ్చు.

### కుర్తాళం ఆంధ్ర మఠంలో వ్యాసపూజ

కుర్తాళం, జూలై 6: తిన్నవెల్లిజిల్లా టెంకాసితాలూకా కుర్తాళంలో శ్రీ సిద్ధేశ్వర పీఠాధిపతి, జగద్గురు శ్రీ త్రివిక్రమ రామానంద భారతి స్వాములవారు, యీ నెల 15 వ తేదీన వ్యాసపూజ మహోత్సవం జరుపుతారు.

### వ్యభిచారిణులపై పంజాబ్ ముస్లింలీగ్ నిషేధం

లాహోర్, జూలై 8: వ్యభిచారిణులు. వాళ్ళ సంపాదన మీద ఆధారపడే వ్యక్తులూ ముస్లింలీగ్‌లో సభ్యులుగా చేరేందుకు అర్హులు కారని నిర్ణయిస్తూ పంజాబ్ ముస్లింలీగ్ నేడు తన నియమావళిని సవరించింది.

### సభలు సమావేశాలు

ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచారసంఘ కార్యకారిణీ సమితి సమావేశము 11 వ తేదీ ఆదివారం సాయంత్రము విజయవాడలో సంఘ కార్యాలయములో శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారి అధ్యక్షతన జరుగునని కార్యవర్గ సభ్యులందరు హాజరు కావలెను కార్యదర్శి దశిక సూర్యప్రకాశరావు గారు కోరుతున్నారు.

# దక్షిణ రైల్వే

వాడిన ఖాళీ టిన్నులు, రాయపురం రైల్వే స్టాకు డిపోవద్ద కొనుటకు టెండర్లు.

వాడుకొని ఖాళీ అయిన టిన్నులు, రాయపురం, రైల్వే స్టాకు డిపోవద్ద, 30-11-1954 తేది గ్రెయిన్ షాపు అగ్రిమెంట్ తీసివేయు నంతవరకు గాని, రేపటి నుండి పూర్తి అయిన అంత వరకు, కొనుగోలు చేయుటకు టెండర్లు సీలువేసిన కవర్లలో పంప కోరబడు చున్నవి. టెండర్లు రాయపురం రైల్వే స్టాకు డిపోవద్ద లభింపగల తెల్లకాగితముపై వ్రాసి పంపవలెను.

2. నిర్ణయించిన ఫారములలో టెండర్లు పంపవలెను. ఈ టెండరు ఫారము ఖరీదు ఒకటి రు. 1/-(ఒక్క రూపాయి మాత్రమే) ఈ సొమ్ము చీఫ్ క్యాషియరు, దక్షిణ రైల్వే, పార్కు టౌన్ మద్రాసు వారి వద్ద చెల్లించవలెను.

3. టెండర్లు పంపదలచిన వారు, తమ టెండర్లను నిర్ణీతఫారములో పంపవలెను. ఫారం ఖరీదు క్రింద చీఫ్ క్యాషియరువారికి చెల్లించి, పొందిన అఫిషియల్ రశీదు దాఖలుచేసి దిగువ సంతకందారు ఆఫీసునుంచి షరతులు, నిబంధనలతో సహా గల టెండరు ఫారములు పొందవచ్చును.

# పశ్చిమ గోదావరి జిల్లా ప్లానింగ్ కమిటీ

## ఉపసంఘాల ఏర్పాటు

ఏలూరు, జూలై 6: ఈ నెల 1 వ తేదీని జరిగిన జిల్లా ప్లానింగ్ కమిటీ సమావేశంలో ఈ క్రిందివారు ప్లానింగు కమిటీకి అధికారేతర సభ్యులుగా చేర్చు కోబడినారు.

శ్రీమతి విజయలక్ష్మమ్మ, డా॥ వై. సూర్యనారాయణరావు, శ్రీ మేకల రంగయ్య, శ్రీ ప్రతివాద భయంకరం రంగాచార్యులు, నంబూరి శ్రీనివాసరావు, శ్రీ గొట్టుముక్కల వెంకన్న, శ్రీమతి మూల్పూరు చుక్కమ్మ, శ్రీమతి బగ్గాల చంద్రమ్మ, శ్రీ గుడిమెట్ల గంగరాజు, శ్రీ వి. వి. సోమరాజు, శ్రీ అల్లూరి బాపినీడుగారలు.

పై సమావేశంలోనే జిల్లా ప్లానింగ్ సబ్ కమిటీ ఒకదాన్ని ఈ క్రింది సభ్యులలో నియమించారు. జిల్లా ప్లానింగ్ ఆఫీసర్ డెల్టా ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్, జిల్లా వ్యవసాయాధికారి, జిల్లా ఆరోగ్యాధికారి సహకార సంఘాల డిప్యూటీ రిజిస్ట్రార్, శ్రీ చింతలపాటి మూర్తిరాజు, ఎం. ఎల్. ఏ. శ్రీ కొమ్మారెడ్డి సూర్యనారాయణ ఎం. పి. గారలు.

జాతీయ విస్తరణ ప్రణాళిక

# ఆంధ్రలో భారత కాంగ్రెసు కార్యదర్శి పర్యటన ప్రారంభం

## కాంగ్రెసు కార్యకర్తల దుస్థితిపై శ్రీ బల్వంతరాయ్ మెహతాకు చిత్తూరుజిల్లా కాంగ్రెసుప్రముఖుల వివరణ

చిత్తూరు, జూలై 6: ఆంధ్రలో కాంగ్రెసు పరిస్థితులను స్వయంగా చూచి తెలుసుకొని లోపాలను చక్కబెట్టుటకై అఖిల భారత కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి శ్రీ బల్వంతరాయ్ మెహతాగారు, ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ బి. గోపాలరెడ్డి, సహాయ కార్యదర్శి శ్రీ పార్థసారథిగారలతోకలిసి నిన్న సాయంత్రం యిక్కడికి వచ్చారు. ఆంధ్రలో వీరి పర్యటన చిత్తూరుజిల్లాతోనే ప్రారంభమైంది. మునిసిపల్ ట్రావెలర్సు బంగళావద్ద జిల్లా కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ దంగ్రాలాయనాయుడు, కార్యదర్శి శ్రీ డి. శ్రీనివాసఅయ్యంగారు, సహాయకార్యదర్శి గాదిరాజు రామమూర్తి, శ్రీ కె. వరదాచారి ఎం. ఎల్. ఎ., శ్రీ టి. ఎన్. వెంకటసుబ్బారెడ్డి, ఎమ్. ఎల్. ఏ., శ్రీ టి. ఎన్. విశ్వనాథరెడ్డి ఎమ్. పి. గారలు, మునిసిపల్ ఛైర్మన్ శ్రీమతి రత్నాబాయమ్మగారు, శ్రీ కె. సి. వెంకటరాజుగారు, లారీ యజమానుల సంఘమునకు చెందిన శ్రీ వెంకట కృష్ణమనాయుడు, శ్రీ గాదిరాజు సత్యం, ప్రభృతులు ఘనంగా స్వాగతమిచ్చి పుష్పమాలలచే సత్కరించారు.

తర్వాత శ్రీ గోపాలరెడ్డిగారు అచ్చట సమావేశమైన ప్రముఖుల నందరిని శ్రీ మెహతాగారికి పరిచయం చేశారు.

### లారీయజమానుల విజ్ఞప్తి

అనంతరం ఆంధ్రాస్టేట్ లోని లారీల ఓనర్ల సంఘం తరఫున శ్రీ మెహతాగారికి విజ్ఞాపనపత్రం సమర్పింప బడినది. ఈ విజ్ఞాపనపత్రం నకలు ఒకటి శ్రీ గోపాలరెడ్డిగారికి గూడా యిచ్చారు.

అందులో రెండుప్రభుత్వాలకున్నూ (మదరాసు, ఆంధ్ర) పన్నులను చెల్లించవలసిన గతి సంభవించినందున లారీల యజమానులు నానాకష్టాలకు గురియవు తున్నారని పన్నులు కట్టలేక లారీలను సగానికి సగం ధరకైనా అమ్మకోవలసిన పరిస్థితి యేర్పడినదని నిరుద్యోగ సమస్యచే చాల బీద కుటుంబాలు తిండి, గుడ్డలేక మాడిపోవుస్థితి వచ్చునని యు, యీ విషయమై కాంగ్రెసు ప్రధానకార్యదర్శిగారు ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులున్ను రెండుప్రభుత్వాలతోను సంప్రదించి వెంటనే లారీల యజమానులకు తగు సహాయముచేసి కాపాడవలసినదిగా కోరారు.

ఈవిషయములు గురించి గాదిరాజు రామమూర్తిగారు సమగ్రంగా వివరించారు.

విజ్ఞాపనను సావధానంగా విని, వెంటనే పన్నులను నిలుపవలెనని రెండు ప్రభుత్వములతో మాట్లాడి, త్వరలో తగుసహాయం చేయుటకు ప్రయత్నం చేసెదనని శ్రీ మెహతాగారు సలహా యిచ్చారు.

రెండుప్రభుత్వాల రవాణా మంత్రుల ...

కులు, కార్యకర్తలను నిర్లక్ష్యభావంతో చూస్తున్నందున వీరిని ఉద్యోగస్థులు లక్ష్యపెడుతారా; ప్రజలు గుర్తిస్తారా; కావున, కాంగ్రెసు అగ్రనాయకులు వీటినన్నిటిని పరిశీలించి కొత్త సదుపాయము కల్గించనిచో కాంగ్రెసు పలుకుబడి తగ్గి కమ్యూనిజం వృద్ధి అవుతోంది" అని హెచ్చరించారు.

పిమ్మట, శ్రీ పాపన్న గుప్తగారు మాట్లాడుతూ, ఈనాడు కార్యకర్తల కిట్టిదుస్థితి వచ్చినందుకు కాంగ్రెసు ప్రభుత్వం కారణం. మహానాయకులే కారకులు. పైవారు క్రిందివారిని చూస్తేనేగాని కాంగ్రెసు సంస్థ పటిష్టంకాదు. అందుకదే మార్గము," అన్నారు.

శ్రీ డి. శ్రీనివాసఅయ్యంగారు మాట్లాడుతూ "కార్యకర్తలు గౌరవ ప్రతిష్ఠలుపోయి ఆర్థికంగా కష్టపడుతున్నారు. వీరిమాటకు చెలామణీలేదు. కాంగ్రెసు ప్రతిష్ఠను నిలుపవలెనంటె కార్యకర్తల పరిస్థితిని చక్కబెట్టాలి. కాంగ్రెసు పెద్దలు కాంగ్రెసు చిన్నల మీద కరుణ చూపుట అత్యావశ్యకమని," సూచించారు.

"కాంగ్రెసుసంస్థ మంచిదే, అందులో ఎలాటి లోపములేదు. అందులో చేరియుండు స్వార్థపరాయణులైన పెద్దలలోనే చాలా లోపాలు యున్నవి. కాంగ్రెసు కార్యకర్తలు అనే నిచ్చనలపై పైకెక్కి వారిని లక్ష్యపెట్టక పోవడంచేతనే ఈనాడిట్టి స్థితి కాంగ్రెసుకు సంభవించినది"ని శ్రీ గాదిరాజు రామమూర్తిగారు వ్యక్తపరిచారు.

ఆనాడు కాంగ్రెసు సంస్థను ధిక్కరించి కాంగ్రెసు వాలంటీర్లను నానా విధాలా హింసించిన సి పాయీలకు యిస్తున్న సౌకర్యములను యీనాడు కాంగ్రెసు ప్రభుత్వం కాంగ్రెసు కార్యకర్తలకిచ్చుట లేదని, శ్రీ ఎల్. సుందరరాజ అయ్యంగారు అన్నారు.

ఆ రోజుల్లో మద్య నిషేధం విషయంలో తీవ్రంగా ప్రచారంచేసి లాఠీల దెబ్బలు తిన్న నాలాటి కార్యకర్తను మాస్తె హడలిపోయ్యే త్రాగుబోతులు ఈ రోజుల్లో మా ఇండ్ల ముందరే వారు త్రాగడాన్ని చూచి మానంతో మండవలసిన స్థితి ఏర్పడినదని, శ్రీ సుబ్బానాయుడుగారు అన్నారు.

### శ్రీ మెహతా సలహా

అన్నిటినిన్ని సావధానంగా విని శ్రీ బల్వంతరాయి మెహతాగారిలా సలహా యిచ్చారు:

"మీరు మాట్లాడిన భాష నాకంతగా తెలియకపోయినా మీరు ప్రభుత్వం మీద, మంత్రులమీద నాయకులమీదను చేసిన ఆరోపణలను, మీ కష్టాలను తెలుసుకొన్నాను. యిలాంటి కార్యకర్తల సభలో తమ తమ కష్టాల ...

గ్రెసు కార్యకర్తలు పూర్వం చూపిన పట్టుదల చూపి ఆర్జించిన స్వాతంత్ర్యాన్ని నిలబెట్టి అభివృద్ధికి తేవలెనని, కోరుతున్నాను"అని శ్రీ మెహతాగారు హెచ్చరించారు. తరువాత, ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు కార్యకర్తలకు పైవిధంగానే సలహాయిస్తూ అన్ని జిల్లాలలోను సంచారం చేసి కార్యకర్తల కష్టాలను యితర విషయాలను తెలుసుకొని వాటిని చక్కబెట్టుటకై కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి శ్రీ మెహతాగారు పని గట్టుకొని వచ్చారని తెలియజేశారు.

"కార్యకర్తలు తమ కష్టములను తెలుపుకోనడం మంచిది. అలాచేయక, ప్రభుత్వాన్ని, మంత్రులను, తదితర నాయకులనున్ను తూలనాడడం భావ్యం కాదని, ప్రభుత్వం చేయుచుండు ఘనకార్యముల గూర్చి శాసనసభ్యులు, కాంగ్రెసు కార్యకర్తలు, ప్రజలకు బోధించడం సమంజసమని, ఉపదేశించారు.

శ్రీ డి. శ్రీనివాస అయ్యంగారి వందనములతో సభ సమాప్తి అయినది. ఈ వుదయం శ్రీ మెహతా, శ్రీ గోపాలరెడ్డిగారలు మదనపల్లెకు వెళ్లారు.

### రాజధానికి రాక

కర్నూలు, జూలై 7: ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ బెజవాడ గోపాలరెడ్డి, సహాయ కార్యదర్శి శ్రీ పి. పార్థసారథిగారలు వెంటరా అఖిల భారత కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి శ్రీ బలవంతరాయ్ మెహతాగారు నేటి సాయంకాలం ఇక్కడికి వచ్చారు.

గవర్నరు శ్రీ చందూలాల్ త్రివేదీ వ్యవసాయశాఖ మంత్రి పి. తిమ్మారెడ్డిగారలను నేటిరాత్రి శ్రీ మెహతా కలుసుకొన్నారు.

ఈ సందర్భంలో ఆంధ్ర కాంగ్రెసు సహాయ కార్యదర్శి శ్రీ పార్థసారథిగారు ఇలా ప్రకటించారు:

"ఈనెల 13 వ తేదీన రాజమండ్రి వెళ్ళే కార్యక్రమాన్ని శ్రీ బలవంతరాయ్ మెహతా రద్దు చేసుకొన్నారు. అందుకు బదులు ఆవేళ కాకినాడ వెళ్లి తూర్పు గోదావరిజిల్లా కాంగ్రెసు కార్యకర్తలను కలుసుకొంటారు. శ్రీకాకుళం కార్యక్రమాన్ని కూడా శ్రీ మెహతా రద్దు చేసుకొన్నారు. 14 వ తేదీన విజయనగరం వెళ్లి 15 వ తేదీన రాయపురం మీదుగా నాగపూరు వెళతారు."

# పశ్చిమగోదావరి కాంగ్రెసు సర్వసభ్యసమావేశం

ఏలూరు, జూలై 4: అఖిలభారత కాంగ్రెసు కార్యదర్శి శ్రీ బల్వంతరాయ్ మెహతాగారు ఆంధ్రదేశ పర్యటనలో యీనెల 12 వ తేదీని ఏలూరు రానున్న సందర్భమున పశ్చిమగోదావరిజిల్లా కాంగ్రెసు కార్యకర్తల విస్తృత సమావేశము ఏలూరులో జిల్లా కాంగ్రెసు భవనమున మధ్యాహ్నం 3 గంటలకు ఏర్పాటు చేయబడినది. కనుక జిల్లాలోని అన్ని తాలూకా, పట్టణ కాంగ్రెసు సంఘాల అధ్యక్ష, కార్యదర్శులు, రైతు, కూలీ, యువజన విద్యార్థి, మహిళ, చేనేతకాంగ్రెసు సంఘాలలోని పనిచేయు కార్యకర్తలు, శాసనసభ్యులు, పార్లమెంటు సభ్యులు జిల్లా, తాలూకా, పట్టణకాంగ్రెసు సభ్యులు కాంగ్రెసు సేవకులు యావన్మంది సమావేశమునకు రావలెనని జిల్లా ...

# భారతీయుల మన్న మాట ముస్లింలు మరువరాదు

## గుంటూరు అంజుమాన్ సభలో డా॥ కట్జూ ఉద్బోధ

గుంటూరు, జూలై 6: డా॥ కైలాసనాథ కట్జూగారు యీ ఉదయం అంజుమాన్ ఇస్లామియా సందర్శించారు. పార్లమెంటు సభ్యులు అంజుమాన్ ఇస్లామియా అధ్యక్షులు అయిన శేక్ గాలీ బుసాహెబుగారు భారత హోంశాఖామాత్యులకు స్వాగతమిచ్చి, పుష్పమాలాలంకృతుల గావించి, సభ్యులను పరిచయం చేశారు. ప్రార్థన తరువాత అంజుమాన్ ఇస్లామియా కార్యదర్శి జె. యం. ఇబ్రహీంగారు ఉర్దూలో సన్మానపత్రం చదివి సమర్పించారు. డా॥ ఖట్జూగారు కూడ ఉర్దూలోనే సమాధానమిచ్చారు. సాంస్కృతిక సమన్వయం అంజుమాన్ ఆశయాల్లో ఒకటి. అందులకు యితర భాషలలో పరిచయం వారి మత సారస్వత గ్రంథాలు అర్థం చేసుకోటం ఎంతో ఆవసరమన్నారు. మన మత ...

# జాతీయ విస్తరణ కార్యక్రమ కేంద్రాలు

## స్త్రీలకు ప్రత్యేకశిక్షణ ఇవ్వడానికి నిర్ణయం

న్యూఢిల్లీ, జూలై 6: దేశంలో ప్రస్తుతమున్న జాతీయ విస్తరణ కార్యక్రమ కేంద్రాలను అభివృద్ధిచేయడానికి, స్త్రీలకు సంఘసేవలో శిక్షణ ఇవ్వడానికి కేంద్రప్రభుత్వం నిర్ణయించింది. సంఘసేవలో స్త్రీల కార్యకలాపాలకు, పురుషుల కార్యకలాపాలకు తేడావున్నందున గృహవిజ్ఞానం, మాతాశిశుసంరక్షణ, ఆరోగ్యం మొదలైనవాటిని సేవికలు చూడవలసివున్నందున ఈ నిర్ణయం చేయబడింది.

ఆధునిక వ్యవసాయపద్ధతులద్వారా ఆహారధాన్యాలను ఎక్కువ పండించడం, గ్రామీణుల జీవనవ్యయ ప్రమాణాన్ని పెంపొందించడం, గ్రామ పునర్నిర్మాణం మొదలైనవాటికి జాతీయవిస్తరణ కార్యక్రమంలో అత్యధిక ప్రాధాన్యం ఇవ్వబడింది. గ్రామప్రాంతాలలోని స్త్రీల సమస్యలను పరిష్కరించడంపై ఆ కార్యక్రమవిజయం ...

# జోర్డాన్‌నదీ జలాల పంపిణీ

# జ్యూరి పద్ధతి ఉంచడం అవసరం

## కేంద్ర హోంమంత్రి డా॥ కట్జూ అభిప్రాయం

# పత్రికా చట్టంక్రింద జర్నల్ నియోగం

## ప్రత్యేకాధికారినియామకం

# గ్రామీణ గృహ నిర్మాణ సంఘాలు

## గరిష్ఠ అప్పు పెంపుదల

# బృందావన మహోత్సవం

# ప్రకాశం స్వామి సీతారాం సమావేశం

# గుండు గొలను వాస్తవ్యుని హత్య

## 8 మందిపై ఛార్జిషీటు దాఖలు

# ఆత్మహత్య

# విజయవాడలో గీత పనివారల పికెటింగు

## 4 గురికి 5 నెలల శిక్ష

# కాంగ్రెసు కార్యకర్తల సభ



# తూర్పు గోదావరి జిల్లా బోర్డు ప్రకటన

తూర్పు గోదావరి జిల్లా, రాజోలు తాలూకా తాటిపాక గ్రామంలో తూర్పు గోదావరి జిల్లా బోర్డువారి స్వాధీన హక్కు భుక్తములలో నున్న "పాత రెస్టు హౌసు కాంపౌండు" అనే భూమి (సర్వే నెం. 49 రు, రమారమి య. 2-00 ట్లు) ఇదివరకు బహిరంగ వేలములో అమ్మవేయగా శ్రీ సరిపెల్ల అర్జునపేర రు. 4,250/- లకు పాట ఖాయపర్చబడినది. సదరు హెచ్చు పాటదారు పాట సొమ్ము పూర్తిగా కట్టలేనందున, సదరు పైన ...



# కావలెను

# రాష్ట్ర వార్తలు

## ఏలూరు

ఏలూరులోని శ్రీ పొట్టి శ్రీరాములు హోమియో అస్పత్రిలో హోమియో వైద్యవిధానం కనిపెట్టిన డాక్టరు సామ్యుయేల్ హానిమన్ 111 వ వర్థంతి సభ నందూరి రామకృష్ణారావుగారి అధ్యక్షతన జరిగింది. హోమియో వైద్యవిధానం యొక్క ప్రాశస్త్యాన్ని వివరించుతూ డాక్టరు సూర్యనారాయణ శాస్త్రిగారు ప్రసంగించారు. శ్రీ పి. సత్యనారాయణ, డాక్టరు మోటూరి సత్యనారాయణ రావుగారలు కూడా ప్రసంగించినతరువాత అధ్యక్షులు ప్రసంగిస్తూ వాణిజ్యమార్గము రహస్యమూ లేకపోవడం చేతనే ఈ వైద్యవిధానం ప్రజలలో విశేషంగా ప్రచారం కాకపోవడానికి ప్రధాన కారణమన్నారు.

## ఒంగోలు

వాయిదాల పద్ధతులలో డబ్బు చెల్లించే పద్ధతిలో వ్యవసాయశాఖవారు రైతులకు ఆయిల్ ఇంజన్లు సప్లయిచేస్తున్నారు. ఈ తాలూకాలో ఇంతవరకు ఈ విధంగా రైతులకు ఎనిమిది ఇంజన్లు ఇచ్చామని స్థానిక వ్యవసాయశాఖ డిమాన్‌స్ట్రేటరు తెలుపుతున్నారు.

ఒంగోలు సబ్ కలెక్టరు శ్రీ వి. సుందరేశన్ గారి అధ్యక్షతన ఈనెల మొదటి తేదీన ఒంగోలు రెడ్‌క్రాస్ సొసైటీ సర్వసభ్య సమావేశం జరిగింది. సంఘ సభ్యత్వ రుసుం గురించి చర్చ జరిగింది. కార్యవర్గ సభ్యులుగా అధ్యక్షుడు సూచించిన పేర్లకు డాక్టరు రామకృష్ణగారు ఆక్షేపణ తెలియజేశారు. శ్రీ డి. వెంకటేశ్వర్లుగారు సంఘ కార్యదర్శిగ ఎన్నికయినారు. ఎస్. సీతారామయ్య నాయుడుగారు కోశాధికారిగా యేకగ్రీవంగా ఎన్నికయినారు. శ్రీయుతులు వి. నారాయణరావు, ఎస్. పున్నారావు (ఒంగోలు పత్రికా రచయితల సంఘ అధ్యక్షుడు), షేక్ మహబూబ్ సాహెబ్, ఎన్. పార్థసారథి, ఎస్. వి. జగ్గారావునాయుడు (కమీషనర్) జి. సత్యనారాయణ కె. వీరరాఘవులు డి. నారాయణ, సి. వి. ఎస్. శాస్త్రి ధూళిపాళ రాజామణిగారలు కార్యవర్గ సభ్యులుగా ఎన్నికయినారు. సబ్‌కలెక్టరు శ్రీ వి. సుందరేశన్ గారు ఉద్యోగ రీత్యా ఈ సంఘానికి అధ్యక్షుడు.

## మార్కాపురం

మార్కాపురం పంచాయతీబోర్డు వారి యాజమాన్యమున పదరు కార్యాలయ ఆవరణలో నిన్న సాయంకాలము 6 గంటలకు స్థానికబోర్డు ఉన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయులు శ్రీ జి. సీతారామయ్యగారు పంచాయతీబోర్డు పుస్తక భాండాగారమునకు ప్రారంభోత్సవము జరిపారు. ఈ సందర్భమున పంచాయతీబోర్డు అధ్యక్షులు డాక్టరు యన్. వెంకటేశ్వర్లు యమ్. బి. బి. యస్. గారు ఉపన్యసిస్తూ ఈ భాండాగారమును నెలకొల్పుటలో పంచాయతీబోర్డువారి కృషిని వివరించారు. త్వరలో ఈ గ్రంథాలయానికి ఒక క్రొత్త భవనము ఏర్పాటు చేయబడగలదని తెలియజేసారు.

మార్కాపురం సబ్ మాజిస్ట్రేటు శ్రీ పి. యన్. శ్రీనివాసన్‌గారు సంచార్యాలకు బదిలీ అయిన సందర్భంలో స్థానిక న్యాయవాది సంఘమువారు, యన్. డి. వి: కె. పత్రికాలయ సభ్యులు తేనీటివిందు చేశారు. స్థానిక ఆఫీసర్స్ క్లబ్ సభ్యులుకూడ విందు చేశారు.

## మాచేరు

ఇటీవల మాచేరు చినమాలపల్లిలో అగ్ని ప్రమాదానికి గురిఅయిన 84 కుటుంబాలవారికి మాచేరు కేంద్ర సహకారబ్యాంకు తరఫున జవ్వాది లక్ష్మయ్యనాయుడు గారు ఈనెల 4 వ తేదీన 84 చీరెలు బహూకరించారు.

## పామర్రు

డిప్యూటీ జూనియర్ ఇన్‌స్పెక్టరు శ్రీ వంకట్రామయ్యగారు ఈనెల మొదటి తేదీన పామర్రులో 'పిల్లల విద్య' అనే లిఖిత మాసపత్రిక ఆవిష్కరణోత్సవం జరిపారు. లిఖిత పత్రిక అవసరం గురించి అధ్యక్షులు వివరించారు. పత్రికవల్ల ప్రయోజనాలను గురించి శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావ్, టి. తిరుమలరావ్, టి. వి. వి. ప్రసన్నరావ్, లంకా నరసింహం, కె. వెంకటాచలం, జి. ఆశీర్వాదంగారు లుపన్యసించారు. శ్రీయుతులు కోగంటి దుర్గా మల్లికార్జునరావ్ లంకా నరసింహం, టి. వి. వి. ప్రసన్నారావ్, జి. ఆశీర్వాదం, కె. వెంకటాచలంగారలు 'పిల్లల విద్య' పత్రిక పాలకవర్గ సభ్యులుగా ఎన్నికయినారు. లంకా నరసింహంగారి కృతజ్ఞతాభివందనాలతో సభ ముగిసింది.

## పెడన

ఆంధ్ర గవర్నరు శ్రీ సి. యం. త్రివేదిగారి 61 వ జన్మదినోత్సవము నిన్న సాయంకాలము పెడనలోని బోర్డు హిందూ బాలుర పాఠశాలలో హెడ్‌మాస్టరు శ్రీ పి. వి. యల్. నరసింహారావుగారి అధ్యక్షతన జరిగింది. అధ్యక్షులు ఉపన్యసించుచు ఆంధ్ర రాష్ట్రము ఏర్పాటు చేసిన యనంతరం శ్రీ త్రివేదిగారు ఎంతో సమర్థతతో పరిపాలించారన్నారు. శ్రీ డాక్టర్ ... రావుగారు సభకు హాజరైన వారందరికి పండ్లు మిఠాయిలు పంచిపెట్టారు.

## తాడిపత్రి

తాడిపత్రిలో ఈనెల 4 వ తేదీన వనమహోత్సవం జరిగింది. ఈ సందర్భంలో జరిగిన సభకు తహసిల్‌దారు ఎమ్. వెంకటరమణప్పగారు అధ్యక్షత వహించారు. కర్నాటి రంగయ్యగారు ఈ సందర్భంలో విందుచేశారు. వనమహోత్సవంయొక్క ప్రాముఖ్యాన్ని వెంకటరమణప్పగారు తమ ప్రసంగంలో వివరించారు. సముజమ్మ అనే చెట్టు ఉపయోగాలను వివరించారు. వాహినీ కళామందిరం, తాలూకాఫీసు, మున్సిపల్ హైస్కూలు, మున్సిపల్ ఆఫీసు ఆవరణలలో చెట్లు నాటారు.

## పెరవలి

తణుకు తాలూకా పెరవలి గ్రామంలో ఈనెల 5 వ తేదీన వనమహోత్సవం జరిగింది. పెరవలిఫిర్కా రెవిన్యూ ఇన్‌స్పెక్టరూ, పబ్లిక్ వర్క్సుశాఖ సెక్షన్ ఆఫీసరూ, వ్యవసాయశాఖ మేస్త్రీ, పెరవలి కొత్తపల్లి పంచాయతీల అధ్యక్షులు, పబ్లిక్ వర్క్సుశాఖా కార్యాలయం ఆవరణలోనూ, బోర్డు ప్రాథమిక పాఠశాల ఆవరణం మొదలయిన ప్రాంతాలలో మొక్కలు నాటారు. పిల్లలకు మిఠాయి పంచిపెట్టారు.

## జగ్గయ్యపేట

జగ్గయ్యపేట వాసవీ గ్రంథాలయం సర్వసభ్యసమావేశం శ్రీ గోనుగుంట్ల నాగేశ్వరరావుగారి అధ్యక్షతన జరిగింది. కొత్తసంవత్సరానికి శ్రీ జి. నాగేశ్వరరావుగారు అధ్యక్షుడుగా, నోముల సూర్యప్రకాశరావ్ గారు కార్యదర్శిగా, చింతా హనుమంతరావ్ గారు సహాయకార్యదర్శిగా, డాక్టర్ ఆర్. సురహరి, నోముల చినసుబ్బయ్య, పుప్పాల భక్తవత్సలరావ్, శ్రీరాం రాజన్న, అప్పన వైకుంఠం, ఓరుగంటి శ్రీరాములు గారలు కార్యవర్గ సభ్యులుగా ఎన్నికయినారు.

## నెల్లూరు

నెల్లూరు ఆంధ్ర మండలి సమావేశము ఈనెల 4 వ తేదీ సాయంత్రము 6 గంటలకు నెల్లూరు, శ్రీ బచ్చువారి తోటలో శ్రీ కుంకుమశంకరంగారి అధ్యక్షతన జరిగింది. ఆంధ్రలో కుటీర పరిశ్రమలయొక్క అవసరం గురించి శ్రీ కోటె వెంకటరంగంగారు పన్యసించారు. ఎమ్. ఎల్. నరసింహంగారి వందన సమర్పణతో సభ ముగిసినది.

ఈనెల 8 వ తేదీన నెల్లూరులో వనమహోత్సవం జరిగింది. ఈ సందర్భంలో జరిగిన సభకు రామారావ్ గారు అధ్యక్షత వహించారు. చెట్లు పెంచడం వల్ల కలిగే లాభాలను గురించి నెల్లూరు వ్యవసాయశాఖాధికారి శ్రీ క. సుబ్బారావ్, అడవి సంపద శాఖాధికారి శ్రీపాల్, జమీన్‌రైతు పత్రిక సంపాదకుడు శ్రీ నెల్లూరు రామానాయుడు, జి. హనుమారెడ్డిగారలు ఉపన్యసించారు. ఈ సందర్భంలో హనుమారెడ్డిగారు విందు చేశారు.

## భీమవరం

శ్రీ చోడవరపు రాధాకృష్ణశాస్త్రి గారి జన్మదినోత్సవం స్థానిక వర్తక సంఘ కార్యాలయంలో జరిగింది. శ్రీ శాస్త్రిగారికి, మిత్రులు ప్రాసిపంపిన సుభాశంసలు, వ్యాసావళి, చందన తాంబూలాది నూత్న వస్త్రములతో నిచ్చి సత్కరించారు. శ్రీ అత్తిలి సూర్యనారాయణమూర్తి అయ్యగారి సుబ్బారాయుడు, కాదుమూరి నరసింహమూర్తి, చెరుకువాడ సుబ్బారావు గారలు శాస్త్రిగార్ని గురించి మాట్లాడారు. శాస్త్రిగారు తమ కృతజ్ఞతను తెలిపి వారి గేయాలను వినిపించారు. గౌరీపతి వందన సమర్పణంతో సభ సమాప్తమైంది. అల్పాహారవిందు జరిగింది.

## కంకిపాడు

శ్రీ కన్యకా పరమేశ్వరి వైశ్య సత్రములో ఆనందరామాయణేత్యాది గ్రంథకర్తలకు బ్రహ్మశ్రీ పండిత చిలుకూరి శ్రీరామశాస్త్రిగారు శ్రీ సీతారామాంజనేయ సంవాదము కడువిపులముగ ఉపన్యసించుచున్నారు. నిత్యము సాయంకాలము 4 గంటలనుంచి 6 గంటలవరకూ కాలక్షేపము జరుగుచున్నది.

## కావలి

కావలి ఆర్. యస్. యస్. ప్రచారకులను శ్రీ కె. కృష్ణమూర్తిగారు చిత్తూరుజిల్లా ప్రచారకులుగ నియమింపబడినందున ఈనెల 4 వ తేదీన నెల్లూరుజిల్లా ప్రచారకులు శ్రీ యస్. సోమయ్యగారి యాజమాన్యమున వీడ్కోలు సభజరిగింది. శ్రీ కృష్ణమూర్తిగారు సంఘ కర్తవ్యాన్ని గూర్చి ఉపన్యసించారు.

## బందరు

బందరులో ఈనెల 4 వ తేదీ ఉదయము జిల్లాకలెక్టరు బంగాళాలోను, కలెక్టరు ఆఫీసు ఆవరణలోనూ వనమహోత్సవము జరిగింది. ఈ మహోత్సవము జిల్లాకలెక్టరు సయ్యద్ అబ్దుల్ కాదర్ గారు, వారి పర్సనల్ అసిస్టెంటు యస్. ప్రకాశరావుగారు, ఎస్టేటు పర్సనల్ అసిస్టెంటు సి. శేకరబాబుగారు, రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు ఆర్. రామమూర్తిగారు, ట్రెజరీ డిప్యూటీ కలెక్టరు వి. వీరభద్రరావు గారు, తాలూకా తహస్సీలుదారూ మొదలైనవారు ... నరసింహారావు, ... యస్. వెంకన్నగారలు కూడా ఈ ఉత్సవంలో పాల్గొన్నారు.

# జాతీయ వికాస ప్రణాళిక సంఘాలు

## దెందులూరు చింతలపూడి ప్రాంతాలకు ఏర్పాటు

ఏలూరు, జూలై 8: పశ్చిమ గోదావరి జిల్లా కలెక్టరు శ్రీ జి. సింహాద్రిగారు ఈ క్రింది వారిని దెందులూరు-భీమడోలు జాతీయవికాస ప్రణాళికా సంఘం క్రింద నియమించారు. అధ్యక్షులు:- ఏలూరు రెవిన్యూ డివిజనల్ ఆఫీసర్, సభ్యులు పంచాయతీల ప్రతినిధులు. శ్రీయుతులు పెద్దిరెడ్డి సత్యనారాయణ (కైకరం) శ్రీ వర్ధినీడి కృష్ణమూర్తి (ఉప్పాక) శ్రీ వసిపల్లి మల్లికార్జునరావు (కొవ్వలి) శ్రీ మన్నా బాలచంద్రుడు (కె. కన్నపురం) సహకార సంఘాల ప్రతినిధులు శ్రీ దత్తాడి రామరాజుగారు (భీమడోలు) శ్రీ మొటపర్తి సీతారామాంజనేయులు (దెందులూరు) రైతులు ప్రతినిధులు శ్రీ భోగరాజు పేర్రాజు (గుండుగొలను) శ్రీ చలసాని ఆంజనేయులు (గోపన్నపాలెం) శ్రీ వట్టి పార్థసారథి (మల్లిమహమ్మద్ పురం) శ్రీ కొమ్మారెడ్డి సత్యనారాయణ వ ప్రసాదరావు (పోతునూరు) శ్రీ మతి గారపాటి హైమవతమ్మ (దెందులూరు) ప్రజాహిత సేవకుల ప్రతినిధులు, శ్రీ తోలుగంటి వెంకటామయ్య (సీతంపేట) శ్రీ ఆలూరి లక్ష్మీనారాయణ (జోగన్నపాలెం) శ్రీ వాసే నాగేశ్వరరావు (పంగిడిగూడెం) శ్రీ గాంధీరాజు (భీమడోలు) శ్రీ రాయుడు గంగయ్య (ఏలూరు) శ్రీ సెత్తాటి నాగేశ్వరరావు శ్రీ మోతే నారాయణరావు (ఏలూరు) అసిస్టెంట్ ఎంజనీర్ (గోదావరి స్పెషల్ డివిజన్) జిల్లా పంచాయతి ఆఫీసర్ (ఏలూరు) సహకార సంఘాల డిప్యూటీ రిజిస్ట్రార్ జిల్లా వ్యవసాయ శాఖాధికారి జిల్లా ఆరోగ్య శాఖాధికారి కార్యదర్శి బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసర్ గోపన్నపాలెం.

### చింతలపూడి జాతీయ వికాస ప్రణాళికా సంఘం

అధ్యక్షుడు ఏలూరు రెవిన్యూ డివిజనల్ ఆఫీసర్, పంచాయతీల ప్రతినిధులు. శ్రీయుతులు శ్రీ మాదాసు వీర వెంకయ్య (చింతలపూడి) శ్రీ కోటగిరి వెంకట రంగారావు (సింగగూడెం) శ్రీ జగ్గవరం వెంకటరామిరెడ్డి (ఎర్రంపల్లి) శ్రీ కవరపల్లి సీతారామయ్య (తే. వరసాపురం) సహకార సంఘాల ప్రతినిధులు. శ్రీ మాగంటి అప్పల నరసింహాచార్యులు (బోర్రంపాలెం) కొండ్రు సూర్యనారాయణ (కామవరపుకోట) రైతుల ప్రతినిధులు శ్రీ మందుల పునరసయ్య (ముంగూడెం) శ్రీ రాజా రాఘవరాజు సూర్యనారాయణరాజు (జీలకర్ర గూడెం) సోషల్ వర్కర్సు ప్రతినిధులు. శ్రీ సిస్ట్లా విశ్వేశ్వర శాస్త్రి (కెంభుదక్రపురం) శ్రీ యనుగంటి పాపారావు (భోగోలు) శ్రీ గద్దె విష్ణుమూర్తి (చింతలపూడి) అధికార్లు అసిస్టెంట్ యింజనీర్ (హైవేస్) ఏలూరు జిల్లా పంచాయతీ, వ్యవసాయ, ఆరోగ్య శాఖాధికార్లు, సహకార సంఘాల డిప్యూటీ రిజిస్ట్రారు.

(స్వ. వి.)

# రాం మనోహర్ లోహియా విచారణ

ఫతైపూర్, జూలై8: ఉత్తరప్రదేశ్‌లో నీటితీరువ హెచ్చింపు రేట్లను చెల్లించవద్దని ప్రచారం చేసినందుకు అరెస్టయిన సోషలిస్టు నాయకుడు రాం మనోహర్ లోహియా విచారణ నేడిక్కడి సెంట్రల్ జైల్లో జుడిషల్ ఆఫీసర్ ఎదుట ప్రారంభమయింది.

బహిరంగ విచారణ జరపాలని లోహియా కోరాడు. వాక్ స్వాతంత్ర్యం రాజ్యాంగంలో ఇవ్వబడ్డదికనుక తనను అరెస్టుచేయటం అక్రమమని ఆయన వాదించగా మేజస్ట్రేటు అంగీకరించక, ప్రభుత్వం విధించే పన్నుల ఔచిత్యాన్ని విమర్శించటమే వాక్ స్వాతంత్ర్యం అవుతుంది కాని, పన్నులు చెల్లించవద్దని ప్రజలకు చెప్పటం వాక్ స్వాతంత్ర్యంగా భావించవీలులేదని అన్నారు.

తాను హెబియస్ కార్పస్ ఉత్తరువును కోరుతూ అలహాబాద్ ప్రధాన న్యాయమూర్తికి, సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తికి పంపిన దరఖాస్తులను అధికారులు నిలిపివేయుటంతో కోర్టు ధిక్కారనేరం చేశారని లోహియా వాదించారు.

# ట్యునీషియాలో 365 మంది అరెస్టు

ట్యునీస్, జూలై 7: మొన్న సోమవారంనాడు ఫ్రెంచి అధిపతులు ట్యునీషియాలో 365 మందిని అరెస్టు చేసారు.

## చంద్రగిరి

రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు కె. సింహాద్రిగారి సమక్షంలో చంద్రగిరి తాలూకాఫీసు ఆవరణలో వనమహోత్సవం సందర్భంలో ఈ నెల 4 వ తేదీన వందమొక్కలు నాటారు. వనమహోత్సవంయొక్క ప్రాముఖ్యాన్ని రెవిన్యూడివిజనల్ ఆఫీసరు ఈ సందర్భంలో జరిగిన సభలో వివరించారు. తహసీల్దారు వి. జగదీశన్ గారి కృతజ్ఞతాభివందనాలతో సభ ముగిసింది.

# హైద్రాబాద్‌కు శ్రీ గిరి ఆగమనం

## కార్మిక ప్రతినిధులతో చర్చలు

హైద్రాబాదు, జూలై 7: కేంద్ర కార్మికమంత్రి వి. వి. గిరిగారు విజయవాడనుంచి ఇవాళ ఉదయం ఇక్కడకు వచ్చారు. రైల్వేస్టేషన్‌వద్ద ఆర్థికమంత్రి వినాయక్ రావ్ విద్యాలంకార్, డాక్టర్ జి. ఎస్. మేల్కోటే, ప్రభుత్వ కార్మికశాఖా సంయుక్త కార్యదర్శి ఎన్. కె. గురుస్వామిగారలు స్వాగతం ఇచ్చారు.

శ్రీ గిరిగారు ఇక్కడ మూడురోజులు ఉండి 9 వ తేదీన సాయంత్రం నాగపూర్‌కు బయలుదేరి వెడతారు.

కేంద్ర కార్మిక శాఖామంత్రి వి. వి. గిరిగారు ఇవాళ ఇక్కడకు రాగానే భారత జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు, రాష్ట్రమజ్దూర్ సంఘం హైద్రాబాద్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు, రైల్వే పనివారల సంఘం ప్రతినిధులను కలుసుకుని, కార్మికుల సమస్యలను గురించి ముచ్చటించారు.

మాజీ నిజామ్ స్టేట్ రైల్వే పనివారల సంఘం తరఫున డాక్టర్ ఎస్. ఎమ్. జయ్ సూర్య, బి. మల్లికార్జునరావు, ఎస్. రాఘవేంద్రరావు, పి. లక్ష్మీనారాయణ్, వై. ఎస్. రావు, బి. బాబయ్య, వెంకట్రావుగారలు కలుసుకొని అన్ని తరగతుల రైల్వేపనివారలకు పరస్పర సహాయనిధి ప్రణాళికను వర్తింప చెయ్యాలన్నారు. నిజామ్‌స్టేట్ రైల్వే విలీనీకరణ కారణంగా కొన్ని అసౌకర్యాలు సిబ్బందికి కలిగాయనీ, అందులో జీతంలో కరువుభత్యం కలిపే సదుపాయాన్ని కోల్పోయారనీ, ఎమ్‌ప్లాయ్‌మెంటు ఎక్స్చేంజిల రిజిస్ట్రేషన్ లోపభూయిష్టంగా ఉన్నదనీ, సలహాసంఘం ఇంతవరకూ సమావేశం కానేలేదని వివరించారు.

హైద్రాబాద్ రాష్ట్ర మజ్దూర్ సంఘ అధ్యక్షుడు బి. ఎస్. మహాదేవ సింగ్ గారు కలుసుకొని తాండూర్ బొగ్గుగనుల విషయంలో కార్మికులకు చెల్లించవలసిన బోనసును గురించి సంప్రదించారు. యీ విషయంలో గిరిగారు రాష్ట్ర ప్రభుత్వంతో సంప్రదించి పరిష్కారానికి పూనుకోవాలని కోరారని కూడా తెలుస్తోంది.

హైద్రాబాద్ భారత జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు అధ్యక్షుడు టి. అంజయ్య, ఆర్గనైజింగ్ కార్యదర్శి అబ్దుల్ గఫూర్ గారలు కలుసుకొని రాష్ట్రంలో మొత్తంమీద కార్మికుల పరిస్థితి సంతృప్తికరంగా లేదనీ, ఫాక్టరీలమూత, కార్మికుల తగ్గింపు జరుగుతోందనీ, కంపెనీలు రద్దు అయి, కొత్తవి ప్రారంభించబడే మధ్య వ్యవధిలో కార్మికులకు తగినంత సహాయం చేయాలనీ ప్రభుత్వం పారిశ్రామిక సంస్థల విషయంలో శ్రద్ధ వహించాలనీ విజ్ఞప్తి చేశారు.

హైద్రాబాద్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు తరఫున డాక్టరు రాజ్ బహదూర్. గౌడ్ కలుసుకొని నిరుద్యోగ సమస్యను రాష్ట్ర యజమానుల, కార్మికుల ప్రతినిధులతో కూడిన త్రైపక్ష సభ్య సంఘం చర్చించాలనీ, కొన్ని మునిసిపాలిటీలు, స్థానిక సంస్థలూ కనీస వేతనాల చట్ట నిబంధనలను అనుసరించ లేదనీ అన్నారు. యూనియన్‌లను గుర్తించే విషయంలో కలుగుతున్న కష్టాలను గురించి కూడా వివరించారు. కార్మిక సంక్షేమ నిధికి యజమానులు కూడా విరాళం ఇవ్వాలని కోరారు.

రోడ్డురవాణా కార్మికుల సంఘం కార్యదర్శి ఎస్. నరహరి సంఘ సలహాదారు జమాలుద్దీన్ గారలు కూడా కార్మిక మంత్రిని కలుసుకొని హైద్రాబాద్ కార్మికశాఖ తమ సంఘాన్ని గుర్తించేటట్లు ఆజ్ఞాపించాలని అర్థించారు. రోడ్డు రవాణా శాఖలో పనులు ఇచ్చేటప్పుడు, పనివాల పిల్లలకు ప్రధానంగా అవకాశం ఇవ్వాలనీ కూడా కోరారు.

కేంద్ర కార్మిక మంత్రి వి. వి. గిరిగారు యీ ఉదయం వివిధ కార్మిక సంఘాల ప్రతినిధులు తెలియజేసిన విషయాలను మూడు గంటల పాటు శ్రద్ధగా విన్నారు.

# నియోజకవర్గాల నిర్ణయసంఘం

## హైదరాబాదులో 12 న సమావేశం

సికింద్రాబాదు, జూలై 7: ఇండియా నియోజక వర్గాల నిర్ణాయక సంఘం, సహాయసభ్యులతో హైదరాబాదు హామంజిల్‌లో హైదరాబాద్ రాష్ట్ర పార్లమెంటు, అసెంబ్లీ స్థానాల నియోజకవర్గాలను ఖరారుచేయటానికి 12 వ తేదీన సమావేశమవుతుంది.

ఇదివరకు ఈ కమీషన్ హైద్రాబాద్ రాష్ట్రానికి 25 లోక్ సభాస్థానాలు, 175 శాసనసభా స్థానాలు నిర్ణయించింది. లోక్ సభాస్థానాలలో 4 రిజర్వుస్థానాలూ, శాసనసభలో 26 రిజర్వుస్థానాలు షెడ్యూల్డుతరగతులకు కేటాయించారు. అసెంబ్లీలో మరో ... స్థానాలు షెడ్యూల్డు జాతులకు కేటాయించారు.

నియోజకవర్గాల కమీషన్ తన ముసాయిదా ప్రతిపాదనలలో చాలా మార్పులు చేసినట్లు తెలుస్తోంది.

# కార్మిక ఇన్సూరెన్సు ప్రణాళిక అమలు

## కేంద్ర కార్మిక మంత్రి గిరిగారి వివరణ

హైద్రాబాదు, జూలై 7: రాష్ట్ర కార్మిక ఆరోగ్య ఇన్సూరెన్సు ప్రణాళికను ఫలానా అని పేర్కొనబడిన అన్ని పారిశ్రామిక సంస్థలకు వర్తింపజేస్తే, దాదాపు 25 లక్షల మంది కార్మికులకు సదుపాయం చేకూరుతుందనీ, అన్ని పారిశ్రామిక కార్మిక కుటుంబాలకు త్వరలో ఈ సదుపాయం కలుగగలదని ఆశిస్తున్నామనీ, దానివల్ల ఒక కోటిమంది లాభం పొందగలరనీ కేంద్ర కార్మిక శాఖామంత్రి శ్రీ వి. వి. గిరిగారు ఇవాళ పత్రికా ప్రతినిధులకు తెలియజేశారు.

ఈ ప్రణాళిక విషయం ప్రధానంగా రాష్ట్ర ప్రభుత్వంతో సంప్రదింపులు జరపటానికి తాము హైద్రాబాదుకు వచ్చామనీ, త్వరలో ఈ ప్రణాళిక అమలు జరపాలని భారత ప్రభుత్వం కోరుతోందనీ అన్నారు.

ప్రస్తుతంలో ఈ ప్రణాళిక కాన్పూర్, ఢిల్లీ, పంజాబ్‌లలో అమలు జరుగుతోందనీ, నాగపూర్‌లో మధ్యప్రదేశ్ ముఖ్యమంత్రి 11 వ తేదీన ప్రారంభోత్సవం చేస్తారనీ వివరించారు.

సెప్టెంబరులో కలకత్తాలోనూ, అక్టోబరు 2 వ తేదీన బొంబాయిలోనూ, అహమ్మదాబాద్‌లో 1955 జనవరి 26 వ తేదీన ప్రారంభించ బడుతుందనీ, ఇతర ప్రాంతాలలో క్రమేణా ఈ ప్రణాళిక అమలు జరుపబడుతుందనీ ఆశాభావాన్ని వెల్లడించారు.

పారిశ్రామిక సంబంధాల బిల్లును మంత్రివర్గ ఉపసంఘం చర్చించిందనీ, సంఘం తన పనిని ఇంకా పూర్తిచెయ్యలేదనీ అన్నారు.

# హైద్రాబాద్‌లో పనివారల భీమా ప్రణాళిక

## సెప్టెంబరు 25వ తేదీన అంకురార్పణ

హైద్రాబాదు, జూలై 7: హైద్రాబాదు, సికింద్రాబాదు నగరాలలో పనివారల భీమా ప్రణాళికకు సెప్టెంబరు 25వ తేదీన ప్రారంభోత్సవం జరుగుతుంది. బహుశా కేంద్ర కార్మిక మంత్రి శ్రీ వి. వి. గిరిగారే ప్రారంభోత్సవం జరపవచ్చు.

హైద్రాబాదు రాష్ట్ర ఆరోగ్య మంత్రి నవాబ్ మెహదీ నవాజ్ జంగ్ కార్మిక మంత్రి డాక్టర్ మేల్కోటే గారలు ఇవాళ కేంద్ర కార్మిక మంత్రి వి. వి. గిరి గారితో జరిపిన సమావేశంలో తాత్కాలికంగా ఈ నిర్ణయం చేయబడింది.

హైద్రాబాద్ ప్రభుత్వం కార్మిక ఆరోగ్య ఇన్సూరెన్సు ప్రణాళికను రాష్ట్రానికి వర్తింపచేయ నిర్ణయించింది. ప్రప్రథమంలో ఈ ప్రణాళికను హైద్రాబాద్, సికింద్రాబాద్ నగరాలలోని పారిశ్రామిక కార్మికులకు వర్తింప చేయబడుతుంది. ప్రారంభంలో దాదాపు పదివేల మంది కార్మికులు ఈ సౌకర్యాన్ని పొందుతారు.

కేంద్ర కార్మిక మంత్రి వి. వి. గిరిగారు ఇవాళ డాక్టరు బి. రామకృష్ణ రావుగారితో కలిసి మాట్లాడారు.

ఈ ప్రణాళిక ప్రకారం యజమానులు ప్రీమియమ్‌లు భరించవలసి ఉంటుందని భావించబడుతోంది. కార్మికశాఖ తోడ్పాటుతో వైద్యశాఖ వైద్య సౌకర్యాలను కలుగ చేయవలసి ఉంటుంది.

# హైద్రాబాదు కాంగ్రెసు శాసన సభ్యుని రాజీనామా

హైద్రాబాదు, జూలై 6: మల్కాపూర్ సహకార వ్యవసాయ కౌలుదార సంఘం నుంచి 3,600 ఎకరాలు శ్రీ వి. గోపాల్ రెడ్డిగారి స్వాధీనం చేస్తూ డిప్యూటీ రెవిన్యూమంత్రి జారీ చేసిన ఉత్తర్వుపట్ల నిరసన సూచకంగా శ్రీ ఎల్. బి. కొండా కాంగ్రెసు శాసనసభా పార్టీ సభ్యత్వానికి రాజీనామా చేశారు.

యీ సందర్భంలో కాంగ్రెసు పార్టీ నాయకుడు రామకృష్ణ రావు గారికి ఒక లేఖ వ్రాస్తూ, రాజీనామా కారణాలను వివరించారు. లేఖ ఇవాళ పత్రికలకు విడుదల చేయబడింది.

# హైద్రాబాదు వార్తలు

కస్టమ్సుశాఖ అసిస్టెంటు సూపరింటెండెంట్లుగావున్న శ్రీ అహమ్మద్ మొహియుద్దీన్, శ్రీ ఇస్రత్ ప్రసాద్ ఎక్సైజ్ అసిస్టెంటు సూపరింటెండెంట్లుగా నియమించబడ్డారు.

నిజామాబాదు వ్యవసాయ శాఖ డిప్యూటీ డైరెక్టరు శ్రీ కె. వేణుగోపాల్‌ను భారత ప్రభుత్వోద్యోగంలోకి తీసుకోవడమైంది.

లష్కర్ బజార్ ప్రభుత్వోన్నత పాఠశాల ఆవరణలో 5 వ తేదీ ఉదయం వనమహోత్సవ సందర్భంగా సభ జరిగింది. ఉపాధ్యాయులు, విద్యార్థులు చెట్ల ప్రాముఖ్యాన్ని గురించి మాట్లాడారు. అనంతరం పాటకచేరీ జరిగింది.

హైద్రాబాద్ స్పిన్నింగ్, వీవింగ్ మిల్లు పనివారల ప్రావిడెంటు ఫండును పూర్తిగా చెల్లించవలసిందిగా ప్రాంతీయ ప్రావిడెంటు ఫండు కమీషనర్‌కు ప్రభుత్వం ఉత్తర్వులు పంప

# శ్రీ రామసాగర మిశ్రా అరెస్టు

## యు. పి. హింద్ కిసాన్ పంచాయత్ కార్యదర్శి

ఆగ్రా, జూలై 7: ఉత్తర ప్రదేశ్ కిసాన్ పంచాయత్ కార్యదర్శి ఉత్తర ప్రదేశ్ ప్రజా సోషలిస్టు పార్టీ కార్యవర్గ సభ్యుడు శ్రీ రామసాగరమిశ్రాను తుండ్లాలో అరెస్టు చేశారు. ఇది ఇక్కడకు 20 మైళ్ళ దూరంలో వుంది. ఆయన్ను ప్రస్తుతం ఆగ్రా జైలుకు పంపించారు.

బడినట్లు తెలుస్తున్నది.

హైద్రాబాద్ కేంద్ర సహకార సంఘ అధ్యక్షుడుగా శ్రీ జె. వి. సింగ్ చౌహాన్ ఎన్నిక సక్రమమైనది కాదని శ్రీ మాధవరావ్ అన్వారీ, శ్రీ కుందా లక్ష్మణ్‌లు చేసిన దావా నేడు హైకోర్టు విచారణకు వచ్చింది.

ప్రతివాదికి సమన్సు పంపుటకు శ్రీ లక్ష్మణ్ రొక్కం చెల్లించలేదని ప్రధాన న్యాయమూర్తి శ్రీ మిశ్రా, న్యాయమూర్తి ఎం. ఏ. అన్సారీగారలు విచారణకు వాయిదా వేశారు.

తమ ఉత్తర్వు న్యాయసమ్మతమైనదేనని సహకార సంఘాల రిజిస్ట్రార్ సమాధాన పత్రం దాఖలు చేశారు.

శ్రీ జేపిసింగు చౌహాన్ కూడా కౌంటరు పిటీషన్ దాఖలు చేశారు. తమ ఎన్నిక క్రమబద్ధంగానే జరిగిందన్నారు.

# ప్రాక్-పశ్చిమదేశాల వ్యాపారం

## బ్రిటన్-అమెరికా ఒప్పందం

వాషింగ్టన్, జులై 7: ప్రాక్పశ్చిమ రాజ్యాలమధ్య వర్తక వాణిజ్యాలను గురించి అమెరికా బ్రిటనులు ఒక ఒప్పందానికి వచ్చినట్లు నేడు ఈ రెండు దేశాలు సమష్టిగా ఒక ప్రకటన చేశాయి.

ఈ ప్రకటన వెలువడ్డానికి పూర్వం బ్రిటిష్ వాణిజ్య వ్యవస్థ అధ్యక్షుడు పీటర్ థారన్‌క్రాఫ్టు అమెరికా విదేశ వ్యాపారవ్యవస్థ అధ్యక్షుడు హారాల్డు స్టేస్సన్‌లు కలుసుకొని మాట్లాడారు. ఈమాటలు, ఈ ప్రకటన కమ్యూనిస్టు దేశాలకు కీలక వస్తువుల ఎగుమతి చేయడం విషయమై కంట్రోళ్లు విధించడాన్ని, సడలించడాన్ని గురించి నద.

# పాక్ భారతదేశాలమధ్య రైలు మార్గం

కరాచీ, జూలై 6: లాహోర్ అమృతసర్‌లమధ్య రైళ్ల రాకపోకలు తిరిగి ప్రారంభించటం, భారత ప్రాంతంలో ఏర్పాట్లు పూర్తి కానందువల్ల ఆలస్యమయిందని పాక్ ప్రభుత్వ వర్గాలద్వారా తెలిసింది. పాకిస్తాన్ వైపున ఏర్పాట్లన్నీ పూర్తి అయాయట. దేశవిభజన నాటినుంచీ ఈ మార్గంలో రైళ్ళ రాకపోకలు నిలిచిపోయాయి.

# ఇండియాలో కమ్యూనిజం ప్రచారకులు

## పంత్, నెహ్రూలేనట

ఆగ్రా, జులై 6: "భారతదేశంలో కమ్యూనిజాన్ని ప్రచారంచేసేవాళ్లలో అగ్రగణ్యులు అజయ్‌ఘోష్, గోపాలన్‌లు కారు; పండిత నెహ్రూ, గోవిందవల్లభపంత్ మొదలైనవాళ్లే. 1932 సం॥ ప్రత్యేకాధికారాల చట్టంవంటి దుష్టశాసనాలను ఉపయోగించి వాళ్లు జరిపే చర్యలే దానికి కారణం" అని ఉత్తరప్రదేశ్ మాజీమంత్రి ఎస్. కె. డి. పలివాల్ నేడిక్కడ ఒక సభలో విమర్శించారు.

ఉత్తరప్రదేశ్ ప్రత్యేకాధికారాల చట్టంక్రింద జరిగిన డా॥ రాంమనోహర్ లోహియా అరెస్టుకు నిరసన వెల్లడించటానికి ఈ సభ ఏర్పాటయింది.

# ప్రీవీకౌన్సిల్‌లో కెన్యాతా అప్పీలు కొట్టివేత

లండన్, జులై 7: జోమో కెన్యాతా, మరి నల్గురు ఆఫ్రికన్‌లు తమకు కెన్యాలో మేజస్ట్రేటు విధించిన శిక్షను గూర్చి చేసుకున్న అప్పీలును లండన్‌లోని ప్రీవీకౌన్సిల్ కొట్టివేసింది.

వీరికి మావ్‌మావ్‌లో సంబంధం వున్నదని గవర్నరు నియమించిన మాజిస్ట్రేటు ఏడేసిసంవత్సరాల శిక్షను విధించాడు.

హైద్రాబాదు, విజయవాడ, మద్రాసు స్వాగతం

కవిరాజ్ పండిత సుఖాద త్రిశర్మ, వైద్య వాచస్పతి, ప్రపంచ ప్రఖ్యాత నవరత్న కల్ప' ఆవిష్కర్తయైనవారు ఇండియా లో ముఖ్యపట్నాలకు ప్రతినెల వెళ్లెదరు

సంప్రదింపు ప్రదేశాలు, గంటలు

తాజ్ మహల్ హోటల్, 88, అబ్బిడర్డు వీధి, సికిందరాబాదు. ఫోను: 7474.

ప్రతినెల 10 మధ్యాహ్నం, 11 తేదీలు.

వెల్ కం హోటల్, సుమతి బిల్డింగ్, గాంధీ నగర్, విజయవాడ-2. ఫోను: 286.

ప్రతినెల 12, 13 తేదీలు.

అంబాసిడర్ హోటల్, 151, మౌంట్ రోడ్డు, మద్రాసు-2. ఫోను: 88923.

ప్రతినెల 14, 15 తేదీలు.

ఉ॥ 7-30 నుండి మ॥ 12-30 వరకు సా॥ 4-0 నుండి రా॥ 7-30 వరకు; వారిని స్వయముగా కలుసుకొని వైద్య సలహా పొందుడు.

కార్యక్రమం తు, చ తప్పకుండుటకై విమానములో ప్రయాణము చేయుదురు.

"నవరత్న కల్ప" వాడండి

వజ్రలు, రత్నములు, ముత్యములు, పగడములు, పచ్చలు, గోమేధికము, పీలము, పిలమణి, వగైరా తొమ్మిది విలువగల రాళ్లు గలసినది.

| | |
|---|---|
| గుండె జబ్బులకు | పిచ్చికి |
| నరముల బలహీనతకు | అతిమూత్రమునకు |
| అజీర్ణ వ్యాధులకు | మూర్ఛకు |
| రక్తవిషములకు | మొలలు, ఉబ్బసం |

శాశ్వతముగా పోవుటకు వాడండి. ఆరోగ్యము చేకూర్చుటకు దీనికి దీనిదే సాటి.

ఢిల్లీ, బెంగుళూరు, కోయంబత్తూరు, సేలం, కాలికట్టు, తిరుచూరు, కొట్టాయం, క్విలన్, ఎర్నాకులం & మైసూరు క్యాంపుల అడ్రసులకు, ఇతర వివరములకు వ్రాయుండి

The Manager, NAVRATNA KALPA PHARMACY Jullundur City (India) Gram: "Navratna" Phone: 401

ఆంధ్ర ప్రభుత్వము

ఎలెక్ట్రిసిటీ డిపార్టుమెంటు

మచికండ్ హైడ్రో యెలెక్ట్రిక్ స్కీము - చైనేజ 211-33" వద్దనున్న పెన్ స్టాక్ పైపులైనుకు చెందిన నెం. 4 అంకర్ యొక్క సూపర్ స్ట్రక్చర్ కట్టుట

పీస్‌వర్కు కాంట్రాక్టు

పైన వివరింపబడిన పనికి, దిగువ సంతకము చేసిన వారిచే సీలు వేసిన టెండర్లు 27-7-54 తేదీ మ॥ 3 గం॥ లోగా చేరునట్లు పంపగోరబడుచున్నవి. సీలు వేసిన కవరుమీద "Construction of Superstructure of AnchorNo.4A of the Penstock Pipe Line at Chainage 211.33" అని వ్రాయవలెను.

టెండరు పెట్లు, పరిమాణముల షెడ్యూలు 12-7-54 తేదిన గాని లేక అంతకు పైన గాని లభింపగలవు. ఈ ఫారముల ఖరీదు రు. 5-1-3 లు చెల్లించి (1) దిగువ సంతకము దారు వద్దను, (2) ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, సివిల్ & హైడ్రాలిక్స్, ఆంధ్రస్టేటు, నెం.20, రట్లండ్ గేట్, నుంగంబాకం మద్రాసు-6 వారి వద్దను, ఆఫీసు పని చేయు గంటలలో పొందవచ్చును. సదరు రు. 5-1-3 "P. W. III-other remittances - receipts on account of the Superintending Engineer, Machkund Hydro Electric Scheme, Machkund" అను శీర్షిక క్రింద చెల్లించవలెను. ఈ సొమ్ము యే కారణము వలన గాని తిరుగు యివ్వబడదు.

రు. 1,900/- (పందొమ్మిది వందల రూపాయలు) బయానా క్రింద చెల్లించి సదరు రశీదును టెండరుకు జతపర్చవలెను. బయానా మొత్తము చెల్లించిన రశీదు జతపర్చబడని టెండర్లు ఆలోచనకు తీసికొనబడవు. రొఖము చెల్లింపులు ప్రభుత్వపు ఖజానాలు జేనిలో గాని, లేక సబ్ ట్రెజరీలలో గాని, లేక రిజర్వుబ్యాంకు ఆఫ్ ఇండియా బ్రాంచీలు జేనిలో గాని మచికండ్ హైడ్రో యెలెక్ట్రిక్ స్కీము, (మచికండ్) సూపరింటెండింగు ఇంజనీరుగారి ఖాతాన "రివిన్యూ డిపాజిట్లు" లెఖకు జమకట్టించవలెను. నిరాకరింపబడిన టెండర్ల సొమ్ము దరఖాస్తు మీద తిరుగు యివ్వబడును.

డిపార్టుమెంటు వారి ఫారములో పంపబడనట్టియు, నిర్ణయింపబడిన తేదీలోగా చేరనట్టియు టెండర్లు నిరాకరింపబడును. ఒకటికంటె యెక్కువ మంది కంట్రాక్టర్లకు ఇచ్చుటకు గాని, లేక యే కారణములు తెలుపక నే ఒకటి గాని లేక అన్ని టెండర్లను నిరాకరించు అధికారం సూపరింటెండింగు ఇంజనీరు గారు రిజర్వు చేసికొనియున్నారు.

ఏ. వెంకటేశ్వరన్,
సూపరింటెండింగు ఇంజనీరు మచికండ్ హైడ్రో ఎలెక్ట్రిక్ స్కీము మచికండ్ వాటరు (R.S) మార్గం. కోరాపుట్ జిల్లా
తంతి: "Dudumenger"
మద్రాసు Mochkund.

కుష్ఠు * బొల్లి

వగైరా చేమచుక్కలు, సెగ, సవాయి వ్యాధులకు, న్యాయంగా చికిత్స, కొంచెం ఖరీదు. ఉత్తరం. సలహాకు జి.వి.రెడ్డిగారు, (రిజిష్టర్డు) "ధాన్యక్కరా క్రమము" గోపాలపురం, తూ. గోదావరి.

# మద్రాసు రేడియో కేంద్రం

## నూత్నభవనంలో జూలై 11 నుంచి ప్రసారం ప్రారంభం

మద్రాసు, జూలై 8: ఆలిండియా రేడియో మద్రాసుశాఖవారి కార్యాలయం మెరినాబీచిలో నూత్నంగా నిర్మించిన స్వంతభవనాల్లోకి జూలై 11 ఆదివారం మారుతుంది. ఈ సందర్భంలో మద్రాసు స్టేషను డైరక్టరు శ్రీ సూరి నారాయణమూర్తి స్టేషన్ ఇంజనీరు పి. జె. గులాటీ, నిర్మాణ ఇంజనీరు కె. వెంకట్రామనుగారలు నిన్న నుపత్రికా ప్రతినిధులకు నూత్నభవనాలను, స్టూడియోలను, చూపించారు. ఆలిండియా రేడియో మద్రాసు కార్యాలయం 16 ఏండ్లుగా ఎగ్మూరులో అద్దె భవనాల్లో ఉంటోంది. కొత్తభవనంలో అయిదు స్టూడియోలు ఉన్నవి. 8 స్టూడియోల భవనం మరొకటి నిర్మాణం కానున్నది.

## రేడియో

శనివారం, జూలై 10.

విజయవాడ

ఉ॥ 6-55 స్వాగతం 7.0 తెలుగు వా. 7-15 మద్రాసు బి వలె. 8.0 ఆం. వార్తలు.

మ॥ 1-0 బివలె. 1-30 ఎ వలె. 1-40 హిందీ వార్తలు. 1-50 తెలుగు వా.

సా॥ 4-0 వనితావాణి 5-30 కె. రంగస్వామి 6-0 ఉభయకుశలోపరి 6-15 ప్రాంతీయ వా. 6-25 స్థానిక ప్రకటనలు 6.30 గ్రామస్థుల కార్యక్రమం. మూగనోము (విశ్వనాథ) కావ్యగానము 7-0 తెలుగున వార్తలు. 7-15 మనకు ఇదేమిగిలింది (రూపకము) 7-30 కల్పలత (8) 8 0 కె. రంగస్వామి 8-30 వి. బి. కనకదుర్గ 9-0 ఆంగ్ల వా. 9-15 రాష్ట్రీ అభివృద్ధి ప్రణాళికలు (అంగ్ల ప్రసంగం) 9-30 అఖిలభారత సంగీత కార్యక్రమం విలాయత్ హుస్సేన్‌ఖాన్ (ఢిల్లీనుండి రిలే) 11-0 ప్రసార సమాప్తి.

మద్రాస్ (ఎ)

ఉ॥ 6-55 స్వాగతం 7 వాద్య సమ్మేళనం 7-15 తమిళమున వా॥ 7-30 కనకసభాపతి అయ్యర్ 8 ఆంగ్లమున వా॥.

మ॥ 1 మహిళామండలి. - మైలురాళ్లు (నాటిక) సి. పదాపతి 1-30 (8), 1-40 హిందీలో వా॥ 1-50 (8), 2 తమిళమున వా॥ 2-10 (బి) వలె, 2-15 సి. వి. కృష్ణమూర్తి, 2-45 (8).

సా॥ 4 (బి) వలె, 5-30 ఎ. సుబ్బయ్య (వ.) 6 ఆంగ్లమున వా॥ 6-15 ప్రాంతీయ వా॥ (త.) 6-25 రాజలక్ష్మీ నారాయణన్, 7 రామేశ్వరం, (తమిళ ప్రసంగం), 7-15 తమిళమున వా॥ 7-30 ప్రసంగం (త.) 7-45 జంత్ర సమ్మేళనము, 8 సంధ్యాగానం (8), 8-15 నాగకోయిల్ హరిహరన్, 9 ఆంగ్లమున వా॥ 9-15 జి. గౌరీ, 10 పాశ్చాత్య సంగీతం.

మద్రాస్ (బి)

ఉ॥ 7 తెలుగున వా॥ 7-15 ఉదయగానము, 7-30 బాలానందం, 8 (ఎ) వలె.

మ॥ 1 (8) 1-30 ఆంగ్లమున వా॥ 1-40 (8), 1-50 తెలుగున వా॥ 2 వీణ - విలయు విద్వాంసుడు, 2-15 పిల్లలకు (త.)

సా॥ 4 పిల్లలకు (అం.) 4-30 పాశ్చాత్య సంగీతం, 5-30 (ఎ) వలె, 6-15 ప్రాంతీయ వా॥ 6-25 నీతి విశ్వమంతా-పి. కాంతకుమారి, 6-30 గ్రామ కార్యక్రమం, 7 తెలుగున వా॥ 7-15 మనకి ఇదే మిగిలింది రూపకం. 7-30 ఊరూపేరూ: స్థలాల ఇతిహాసములు (ప్రసంగం) 7-45 ఎ వలె 8 నాటిక (8) 8-30 ఎ వలె 9-15 విజయవాడవలె 9-30 అఖిలభారత సంగీత కార్యక్రమం విలాయత్ హుస్సేన్‌ఖాన్, (ఢిల్లీ రిలే) 11 ప్రసారసమాప్తి.

హైదరాబాద్

ఉ॥ 6-55 సుప్రభాత్ 7 తెలుగు వా. 7-15 పి. సుబ్బస్వామి (వ) 7-45 కన్హయలాల్-భజన్, గీత్. 8 ఆంగ్ల వా. 8-15 హిందీ వా. 8-30 ఎం. జగన్మోహన్ గీత్ 8.45 భజనే.

మ॥ 12-30 టిప్రా (8) 12-50 మరాఠీ వా. 1 కె. రాజలక్ష్మి, 1-30 (8) 1-50 తెలుగు వా.

సా॥ 5-30 గంధం నరసయ్య, గీతావళి. 5-45 తరంగాలు. 6 కన్నడ కార్యక్రమం. 6-30 వనితావాణి. (8) 6-40 స్థానిక ప్రకటనలు 6-45 గ్రామసీమ. వర్షాకాలంలో పశువుల రోగాలు (ప్రసంగం.) గీతావళి 7 తెలుగు వా. 7-15 గ్రామసీమ-పశువులకు ప్రథమ చికిత్స. (సంభాషణ), గీతావళి 7-45 కన్నడ వా. 8 ప్రసంగం 8-15 మహమూద్ బేగ్-(తుమ్రీ) 8-30 గీత్ 8-45 భజనే 9 అంగ్ల వా. 9-15 ఉర్దూ వా. 9-30 విలాయత్ హుసేన్ ఖాన్ (రిలే) 11 ప్రసారసమాప్తి.

## ఆంధ్రలో అంటువ్యాధులు

మద్రాసు, జూలై 8: ఆంధ్రరాష్ట్రంలో జూన్ 19 వ తేదీతో అంతమైన వారంలో 31 మంది కలరా తగిలి 18 గురు, 109 గురికి మశూచి తగిలి 25 గురు మరణించారని ఆంధ్రరాష్ట్రీ ప్రజారోగ్యశాఖ డైరక్టరు కార్యాలయం వారి నివేదిక తెలుపుతోంది. కర్నూలుజిల్లాలో 40 మందికి మశూచి తగలగా 10 మందీ, గుంటూరుజిల్లాలో 39 మందికి తగలగా పన్నెండుగురు మరణించారు.

# జెనీవా సంప్రదింపులలో స్వయంగా పాల్గొనడానికి ఫ్రాన్సుప్రధాని నిర్ణయం

పారిస్, జూలై 7: జెనీవాలో ఇండోచైనాపై సంప్రదింపులు జరిపే ఫ్రెంచి ప్రతినిధివర్గానికి తాను స్వయంగా నాయకత్వం వహించబోతున్నట్లు ఫ్రెంచి ప్రధాని మెండీస్ ఫ్రాన్స్ నేడు పార్లమెంటులో వెల్లడించారు. యుద్ధవిరమణ సంప్రదింపులు నెగ్గితీరుతవని ఎవరూ ఖచ్చితంగా చెప్పలేరనీ, అయితే అవి నెరవేరగలవనేందుకు ఇటీవల అనేక కారణాలవల్ల ఆశలు కనిపిస్తున్నవనీ ఆయన అన్నారు. ఒకవేళ సంప్రదింపులు భగ్నమయేట్లయితే, నిర్బంధ సమీకృత సైనికులను ఇండోచైనాకు పంపవలసివస్తుందని మెండీస్ ఫ్రాన్స్ హెచ్చరించారు.

ఈయన ఆదివారం కానీ సోమవారం కానీ జెనీవాకు బయలుదేరతాడని తెలుస్తున్నది.

"ఇండోచైనా సంప్రదింపుల్లో ఫ్రాన్సు లొంగిపోవటమంటూ ఉండదు, యుద్ధవిరమణ ఒప్పందం కుదరటమే జరిగితే, దూర ప్రాచ్యంలో ఫ్రాన్సు ఇంకా ఉండి తన నాగరికతా ప్రచార కార్యక్రమాన్ని కొనసాగించగలదనే చెప్పవలసి ఉంటుంది.

జూలై 20 వ తేదీనాటికి ఒప్పందం కుదరకపోతే నేను రాజీనామా ఇస్తానన్నమాట ఇంకా వర్తిస్తుంది. అయితే నా ప్రభుత్వం నిష్క్రమించే ముందు నిర్బంధ సమీకృత సైనికులను ఇండోచైనాకు పంపేందుకు వీలుగా రాజ్యాంగాన్ని సవరించ వలసిందని పార్లమెంటులో ఒకబిల్లు ప్రతిపాదిస్తాను. జెనీవా సంప్రదింపులు భగ్నమయితే, ఇండోచైనాలో ఫ్రెంచి బలాలను బలపరచటం అవసరం అవుతుంది. అవసరమయితే యూరపుదేశాల్లో ఉన్న ఫ్రెంచిసేనలను ఇండోచైనాకు పంపించేందుకు యూరపుమిత్ర సైన్య సర్వసేనాని జనరల్ గ్రుయెంథర్ ను అనుమతికోసం కిందటి సోమవారంనాడు కోరాను. దానికి ఆయన అనుమతించాడు.

అంటే, ప్రస్తుత సంప్రదింపులు భగ్నమయితే, తక్షణమే మనసేనలను బలపరచటానికి సన్నాహాలు సిద్ధంగా ఉన్నవన్నమాట అని మెండీస్ ఫ్రాన్స్ వివరించారు.

జూలై 20 నాటికి ఇండోచైనాలో యుద్ధవిరమణ సాధించగలననే ధైర్యముతో ప్రధాని భారతదేశంతో సంప్రదింపులు తిరిగి కొనసాగించటంద్వారా ప్రాచ్యదేశాలలో ఒకవిధమైన పద్ధతిని కలిగించాలనీ, స్వదేశంలోనూ, మిత్రదేశాలలోనూ తాము ఫ్రెంచి సామ్రాజ్యాన్ని అంతంచేస్తున్నారనే అభిప్రాయం కలగకుండా వుండే విధముగా వీలయితే పరిష్కారానికి రావాలని అభిలషిస్తున్నట్లు తెలుస్తోంది. ఈ విషయంలో భారతదేశం ఉద్దేశం ఏమిటో ఫ్రెంచి మంత్రిమండలికి బాగా తెలుసు. అందుచేత మరిప్పుడు వారు వెనుకటి లానియల్ ప్రభుత్వం అనుసరించిన విధానానికి భిన్నమైన విధానం అవలంబిస్తారా లేదా అన్నది తేలలేదు. మెండీస్ ఫ్రాన్సు ప్రధాని అయ్యాక మంత్రిమండలి నిర్ణయాలు బొత్తిగా బయటపడటంలేదు. ఇదివరకు ఇట్లావుండేదికాదు.

ఉభయప్రభుత్వాలూ ఒక సూత్రాన్ని ఆమోదించక అందుకు సంబంధించిన వివరాలను చర్చించేందుకే తిరిగి సంప్రదింపులు ప్రారంభం కావాలని భారతప్రభుత్వం అభిప్రాయపడుతున్నట్లు తెలిసింది.

## జెనీవాలో మంత్రుల సంప్రదింపులు

త్వరలోనే జెనీవాలో ఇండోచైనా సమస్యపై సంప్రదింపులు మంత్రుల మధ్యనే జరిగే అవకాశం ఉన్నదని బ్రిటిష్ విదేశాంగమంత్రి ఈడెన్ నేడు కామన్సు సభలో ప్రకటించారు.

నేడు లండన్‌లో సోవియట్ రాయబారి యాకబ్ మాలిక్ బ్రిటిష్ విదేశాంగ మంత్రి ఈడెన్‌ను కలుసుకున్నారు. అగ్రరాజ్య విదేశాంగమంత్రులు జెనీవా సమాలోచనలకు తిరిగివచ్చే విషయమై వీరు చర్చించినట్లు తెలుస్తున్నది.

## యుద్ధవిరమణకై కచ్చితమైన పథకం

ట్రూంగియాలో సమాలోచనలు జరుపుతున్న ఫ్రెంచి యూనియన్-వియెట్మిన్ సైనిక ప్రతినిధులను యుద్ధవిరమణ ఏర్పాట్లపై కచ్చితమయిన పథకాన్ని పరిశీలించవలసిందిగా కోరటం జరుగుతున్నదని హనోయ్‌లో నేడు తెలియవచ్చింది. ఇండోచైనా విభజన విషయమై జెనీవాసభ నిర్ణయంచేసినప్పుడు ఇది జరుగుతుంది. ప్రస్తుతం ట్రూంగియా సంప్రదింపులు ఆశావహంగా జరుగుతున్నదని ఫ్రెంచి వర్గాలవల్ల తెలుస్తున్నది.

దేశవిభజన జరక్కుండా యుద్ధవిరమణ సాధించటమే తమ ఆశయమని వియెట్నాం ప్రభుత్వ కొత్త ప్రధాని ఙో దిన్ దియాం నేడు సైగాన్‌లో ప్రకటించారు. దీనికి అమెరికా సాయంకూడా తీసుకోగలమని ఆయన అన్నారు.

మొన్న ట్రూంగియాలో ఉతగా (?) ఖైదీల పరటా విషయమై కుదిరిన ఒప్పందాన్ని బట్టి, వచ్చే బుధవారంనాడు తాము మొదటి జట్టులో 200 మంది ఫ్రెంచి యూనియన్ ఖైదీలను అప్పగించబోతున్నట్లు వియెట్మిన్ రేడియో నేడు ప్రకటించింది.

## వివిధ సమస్యల పరిష్కారానికి కృషి

పారిస్, జూలై 7: ఫ్రెంచిప్రధాని మెండీస్ ఫ్రాన్సు మరి పక్షంరోజుల్లో ఇండోచైనా యుద్ధాన్ని విరమింపజేసే ప్రయత్నంలో నిమగ్నమయి వుండటం మరోచెంప టునీషియా మొరాకోలలో మళ్ళీ అశాంతి రేకెత్తటం వీటి మధ్య ఫ్రెంచి మంత్రిమండలి ఇండియాలో ఇంకా తమకుగల ప్రదేశాల భవిష్యత్తు గురించి సంప్రదింపులు తిరిగి ప్రారంభించాలని భారతప్రభుత్వాన్ని కోరటానికి నిశ్చయించటం పారిస్ రాజకీయవర్గాలలో ఆశ్చర్యం కలిగించింది.

అన్యదేశాలలోని ఫ్రెంచిప్రాంతాల విషయం పరిశీలించే సందర్భంలో యాదాలాపంగానే ఫ్రెంచిండియా విషయం మంత్రిమండలి ఆలోచనకు వచ్చిందట. ప్రధాని వాస్తవిక వాదీ, ఒక విధమైన మితవాది తత్వంగల కన్సర్వేటివ్ కావటంవల్ల అన్యదేశాలలోని ఫ్రెంచిప్రాంతాలలో తలఎత్తుతున్న తీవ్ర జాతీయవాదానికి ఎదురు నిల్చి తన శక్తియుక్తులను వృథా చేసుకొంటే ఫ్రాన్సు యుద్ధానికి మునుపటి స్థాయిని ఎన్నటికీ తిరిగి పొందజాలదని అభిప్రాయపడుతున్నట్లు రాజకీయ వర్గాలవారు భావిస్తున్నారు.

## విముక్తప్రదేశాల పటిష్ట పరిపాలన

పుదుచ్చేరి, జూలై 7: ఫ్రెంచి పారతంత్ర్యంనుంచి విముక్తిపొందిన ప్రాంతాలలో పరిపాలన పటిష్ఠంగా జరిపేందుకు ఫ్రెంచిండియా విమోచనసంఘం వారు ఇద్దరు అనుభవజ్ఞులైన ఉద్యోగులను నియమించారు. వీరిద్దరూకూడా మద్రాసుప్రభుత్వంలో కలెక్టరుగానూ, జిల్లా పోలీసు సూపరింటెండెంటుగానూ పనిచేసి రిటైరైనవారు. కలెక్టరు చేసిన హెచ్. ఎస్. పాల్ ను పరిపాలకుడుగానూ, డి. ఎస్. పి ఉద్యోగం చేసిన రాజా మహమ్మద్ ను పోలీసు ప్రధానాధికారిగానూ వీరు నియమించారు. రాజా మహమ్మద్ గుంటూరు జిల్లా డి. ఎస్. పి. గా పనిచేశారట. వీరిరువురూ విమోచనసంఘానికి బాధ్యులుగా వుంటారు. వీరి ప్రధాన కార్యాలయం నెట్టపాక్కంలో నే వుంటుంది.

మద్రాస్ పోలీస్ ఇన్‌స్పెక్టర్ జనరల్ వి. ఆర్. రాజరత్నం ఈసాయంత్రం మాహే సరిహద్దు ప్రాంతంలో బందోబస్తు ఏర్పాటులను తనిఖీ చేశారు. ఇవి తృప్తికరంగా వున్నవా అని ప్రజలను అడిగి తెలుసుకొన్నారు.

మాహేలోని ఫ్రెంచిపాలకులు విలీనానుకూలురన్న అనుమానం తగిలిన వారి నందరినీ వీరూ వారూ అన్నది లేకుండా అరెస్టు చేసి వేస్తున్నట్లు అక్కణ్ణించి వస్తున్న కాందిశీకులు చెప్తున్నారు.

## "రెండు రాష్ట్రాల వాదంలో పసలేదు"

### విశాలాంధ్ర మహాసభ సభ్యుడు రంగాచార్యులు ప్రకటన

హైదరాబాదు, జూలై 5: రెండు రాష్ట్రాలవాదం హైదరాబాదురాష్ట్రాన్ని చిరస్థాయిగా మనేందుకే తోడ్పడగలదని, ఆవాదంచేసేవారు యిప్పటికైనా గ్రహించివుంటారనీ, ఆంధ్రరాష్ట్రీప్రజలకూ తెలంగాణా ప్రజలకు సంస్కృతి, భాష, చరిత్ర ఒకటేనన్నది నగ్న సత్యమనీ, ఆ విషయంలో ఎవ్వరికి గాని ఏలాటి భేదాభిప్రాయం లేదనీ విశాలాంధ్రమహాసభ సభ్యుడు డా॥ రంగాచార్యులు నేడొక పత్రికా ప్రకటన చేశారు.

ఆంధ్రరాష్ట్రీప్రజలు, తెలంగాణా ప్రజలనుకమ్యూనిస్టు సేనానులతో రెండు రాష్ట్రాలు కావాలనటం పసలేని వాదమన్నారు. ఈ రెండు ప్రాంతాలు విభిన్నమార్గాలలో అభివృద్ధి చెందినవనీ, విద్యలోనూ, వ్యవసాయంలోనూ ఆంధ్రులు తెలంగాణా ప్రజలకన్నా ముందంజ వేసివుండవచ్చునీ, తెలంగాణాలో సహజసంపదలు మెండనీ అన్నారు. ఆంధ్రలో పరిశ్రమ లున్నవనీ, తెలంగాణాలోనూ పరిశ్రమ లున్నవనీ, తెలంగాణాకూడా వైజ్ఞానికంగా అభివృద్ధి చెందుతున్నదన్నారు. వివిధ సంపదలుగల ఒకేజాతికి చెందిన యిరుప్రాంతాలవారూ సమైక్యమైతే పరస్పరం అభివృద్ధి చెందుటకువోలాడ మిపుతుం (?) విన్నారు. విశాలాంధ్రలో తెలంగాణా, ఆంధ్రలు సమానంగా పురోగమించగల రన్నారు.

ప్రస్తుత ఆంధ్రరాష్ట్రంలోటు రాష్ట్రీ మనుష్యంలో కల్పించేవృన్నారు.

# మద్యనిషేధం రద్దు సమస్య

## ప్రజలందరు తోడ్పడాలని లచ్చన్నగారి విజ్ఞప్తి

రేపల్లె, జూలై 6: "మాజీ కల్లుగీత పనివారల సమస్య రాజకీయాలకు అతీతమైనది. ఆసమస్యనుపరిష్కరించుటలో అన్ని వర్గాలవారు సంఘీభావంతో కృషి చేయాలి" అని కృషికార్ పార్టీ నాయకులు శ్రీ గౌతు లచ్చన్న గారు మొన్న 8 వ తేదీన యిక్కడ జరిగిన యీ తాలూకా గీతపనివారల సభలో ఉపన్యసిస్తూ విజ్ఞప్తి చేశారు.

సభకు, స్థానిక న్యాయవాది శ్రీ కోగినేని. రామనాథంగారు అధ్యక్షత వహించారు. లచ్చన్నగారు తమ ఉపన్యాసంలో ఇంకా ఇలా చెప్పారు. "మద్యపానము అనాదినుండి వచ్చుచున్నదే. ఈ వృత్తి క్రొత్తదేమీ కాదు. కల్లుగీత, నిషేధించేపక్షంలో, కల్లుగీత పనివారలకు జీవనోపాధి చూపించాలి. ఆంధ్ర శాసనసభ 'మద్యపాన నిషేధచట్టాన్ని రద్దుచేసి, రామమూర్తికమిటీ నివేదికను అమలు జరపాలని నిర్ణయంచేసింది. అయితే ఈ నిర్ణయాన్ని అమలు జరుపుటకు, కాంగ్రెసువారు ముందుకు రాకపోవటం శోచనీయం. రామమూర్తికమిటీ నివేదికను అమలు జరుపుటలో కాలయాపన జరుగుతోంది. అందువల్ల, కల్లుగీతపనివారు సత్యాగ్రహము చేయుటకు పూనుకోక తప్పిందికాదు. కల్లుగీతపనివారి సమస్యను పరిష్కరించటానికి, ప్రజలందరూ ఆందోళన చేయాలి."

సభలో శ్రీయుతులు సింగం బసవపున్నయ్య, కేసన వెంకటేశ్వర్లు యన్నం ఆదినారాయణ గార్లుకూడా ప్రసంగించారు. శ్రీ అవగాని భగవంతరావుగారి వందన సమర్పణతో సభ ముగిసింది.

## పశువుల దొంగతనం

ఇక్కడ చుట్టుప్రక్కల నున్న గ్రామాలలో, ఒక వింతరకమైన దొంగతనము జరుగుతున్నట్లు తెలియుచున్నది. రాత్రులందు కొందరు దొంగలు, గొడ్లను, తోలుకునివెళ్ళి, వాటిని చంపి, వాని, తోళ్ళను తీసుకుంటున్నారట. రక్తమాంసములతో కూడుకొన్న వీటి కళేబరాలు, కొన్ని చోట్ల దొరికినట్లుకూడా తెలిసినది.

## ఒకేకాన్పున ముగ్గురు బిడ్డల జననం

అరవపల్లికి చెందిన, ఉప్పలపాటి శేషమ్మ అను ఆమెకు, ఈ నెల 3 వ తేదీన, ఇక్కడ హాస్పిటలులో, ముగ్గురు కవలశిశువులు కలిగారు. వారిలో ఇరువురు మొగపిల్లలు, ఒక ఆడపిల్ల. కాని, ఈ పిల్లలు, ఒకరోజు బ్రతికినతరువాత, అంతా మరణించారు. (స్వ. వి.)

## రేపల్లె పరిసరాల్లో వర్షం

ఇక్కడ యీ చుట్టుప్రక్కలనున్న గ్రామాలలో, నిన్న, మొన్న దాదాపు రెండు దుక్కులుదాకా వాన పడినది. ఈ రోజుకూడా, ఇంకా మబ్బుగానే ఉన్నది.

ప్రథమపంచవర్షప్రణాళికసమాప్తంతో ఆంధ్రరాష్ట్రపు బడ్జెట్‌లోని లోటు పూడగలదనిఆశించారు. తెలంగాణాలో లూ 16 కోట్లఆదాయంలోనూ షుమారు ఏడుకోట్లు రూపాయలు అబ్కారీ పన్నుమీద వచ్చే ఆదాయమనీ, త్వరలో మద్యనిషేధంఅమలుజరపక తప్పదు కాబట్టి, యీ రూ. 7 కోట్ల ఆదాయం తగ్గుతుందనీ, అటిత్యా తెలంగాణా ప్రత్యేకరాష్ట్రంగా మనలేదనీ పేర్కొన్నారు.

తెలంగాణాప్రజను రెండురాష్ట్రాల వాదాల తత్వానికి లొంగిపోవద్దని హెచ్చరించారు.

# మద్రాసు వార్తలు

శ్రీ కన్యకా పరమేశ్వరీ దేవస్థానం బాలుర ఉన్నత పాఠశాల బాలుర సంఘ ప్రారంభోత్సవం మంగళవారం సాయంత్రం శ్రీమతి పి. సుందరంగారి అధ్యక్షతను జరిగినది. చినదొరస్వామి ప్రార్థనతో సభాకార్యక్రమంఆరంభింపబడినది. శ్రీ హెచ్. రాధాకృష్ణయ్యగారు స్వాగతవచనాలు తెలిపారు. శ్రీ బులుసు వెంకటరమణయ్యగారు ప్రారంభోపన్యాసం చేస్తూ పిల్లలు చక్కని సాహిత్య వ్యాసంగం అలవాటు చేసుకోవాలన్నారు. విద్యార్థి కార్యదర్శి అభివందనాలతో సభ ముగిసినది.

* * *

చిత్తూరు జిల్లా లారీ యజమానులు మూడు ప్రభుత్వాలకు పన్నుకట్టవలసిన ఇబ్బందిని గూర్చి మద్రాసు ఆర్థిక మంత్రి సి. సుబ్రహ్మణ్యం గారిని నిన్నను ఆంధ్రపత్రిక ప్రతినిధి విచారించగా సుబ్రహ్మణ్యంగారు ఇది ద్రవ్యానికి సంబంధించినదనీ, శ్రద్ధగా పరిశీలిస్తున్నామనీ చెప్పారు.

షెడ్యూల్డు జాతుల తరగతుల, నిమ్న జాతుల విద్యార్థుల మెట్రిక్యులేషను పై తరగతుల అభ్యాసానికి కేంద్ర ప్రభుత్వంవారు 54-55 సం॥నికి రూ. 75 లక్షలు మంజూరు చేశారు.

జూన్ 5 వ తేదీతో అంతమైన వారంలో మద్రాసునగరమందు కార్మికుల జీవన వ్యయసూచి 343 కు పెరిగినది. జూన్ 12 తో అంతమైన వారానికి 342 కు పడిపోయినది.

ఆంధ్రరాష్ట్రీ విభజనానంతరం మదరాసు రాష్ట్రీ చెరకుపంట కమిటీ నల్గురు అధికారులతో ను 7 గురు అనధికారులతోను మూడేళ్లు పర్యంతం నిర్మాణం కాబడినది.

మద్రాసు రాష్ట్రీ ఉన్నత పాఠశాలలో హిందీ బోధ ఐచ్ఛికమనీ, అది నిర్బంధం గాదనీ, మద్రాసు విద్యామంత్రి నిన్న వివరణలో తెలియచేశారు.

మద్రాసు రోటరీ క్లబ్బు అధ్యక్షులుగా ఆర్. రామనాథన్ చెట్టిగారి స్థానే సి. డబ్ల్యు స్టీఫెన్సన్ గారు మొన్న కన్నెమెరాలో జరిగిన సభలో ఎన్నికైనారు.

గుంటూరులో ఆంధ్ర హైకోర్టు స్థాపనలో మద్రాసు హైకోర్టు భవనాల్లో ఖాళీ ఏర్పడినందున సిటీ సివిల్ కోర్టు రెంటు కంట్రోలు కోర్టు హైకోర్టు భవనాల్లోకి తెచ్చే ఆలోచనలు జరుగుతున్నవి.

కాశీకి తీసుకెళ్ళి విశ్వనాథుని దర్శనం చేయిస్తానని 17 ఏండ్ల ముత్యాల కన్యను వలలో వేసుకున్న 45 ఏండ్ల వేలు చెట్టి స్వామియారును నిన్న ఏకుశావుల ప్రాంతంలో పోలీసులు పట్టుకున్నారు. ఆపిల్ల దైవభక్తిపరురాలనీ ఆమెను, కాశీ విశ్వనాథుడి దర్శనం చేయిస్తానని రైలెక్కించి బెజవాడ తీసుకెళ్లి, ఈ స్వామియారు ఎవరికో విక్రయించడానికి బేరం పెట్టాడనీ, ఆసంగతి ఆ పిల్ల కనిపెట్టి పారిపోయి టిక్కెట్టులేకుండా ప్రయాణం చేసి వచ్చి పోలీసులకు తన సంగతి చెప్పినదనీ, దానిపై అతన్ని నిన్న పోలీసులు పట్టుకున్నారనీ తెలుస్తోంది.

కరరాత్రి సినిమా చూచి కారులో వస్తూండగా సుంగంబాకంలో నిలనిస్తున్న నల్గురు అరవయువకులు కారు రోడ్డుప్రక్క స్తంభానికితగిలి వాళ్ళకు గాయాలు అయి జనరల్ ఆసుపత్రిలో చేర్చబడ్డారు.

పేర్పరులో రూ. 600/-విలువచేసే మూడు నూనె పీపాలు దొంగిలింపబడినవి.

జాంబజారులో ఒక దూంపవిక్రేత మూడు మేకలను చంపి అమ్మకానికి సిద్ధంగా పెట్టుకోగా ఆమేకలను కత్తిని గూడా ఎవడో దొంగిలించాడట.

# వర్ణవివక్షతలేక అందరికీ ఒకే జీతం

## తూర్పుఆఫ్రికా జీతాల కమిషన్ సిఫార్సులు

కంపాలా, జూలై 8: తూర్పుఆఫ్రికాలో ప్రభుత్వోద్యోగాలలో వున్న అన్ని జాతులవారికి స్త్రీ పురుష విచక్షణను ఎంచకుండా సమానమైన స్కేళ్లలో జీతాలు ఇప్పించవలసిందిగా కెన్యా ఉగాండా, టాంగనీకా గవర్నర్లు సమిష్టిగా నియమించినవే తన నిర్ణయసంఘంవారు తమ సిఫార్సులలో పేర్కొన్నారు.

ప్రస్తుతం ఈ వలసల్లో యిరోపా వారికి ఇచ్చిన జీతంలో 2/3 వంతుల జీతం మాత్రమే ఆఫ్రికనులు ఉద్యోగులకు ఇస్తున్నారు. ఈ పద్ధతిక్రింద మంచి పైదాకా వుంది. చదువు, పరీక్షలు, హోదా అన్నీ సమంగావున్నా సరే, ఈ భేదం చూపిస్తున్నారు. ఇప్పుడు 2/3 వంతులను 3/5 వంతులుగా మార్చడానికి ఆలోచనలు జరుగుతున్నాయి.

# క్రీడారంగం

## ఆంధ్ర క్రికెట్ సంఘ కొత్త కార్యవర్గం

గుంటూరు, జూలై 7: ఆంధ్ర క్రికెటు అసోసియేషన్ సాధారణ వార్షిక సమావేశం తిరుపతి వాస్తవ్యులు శ్రీ ప్రొఫెసరు బి. వి. రామానుజం గారి అధ్యక్షతన యిచట 4 వ తారీఖున జరిగింది.

1954-55 సంవత్సరమునకు యీ క్రిందివారు కార్యనిర్వాహకులుగా ఎన్నుకోబడ్డారు.

అధ్యక్షులు: మహారాజ్ కుమార్ విజయనంద్ (విజయనగరం), ఉపాధ్యక్షులు: మేజర్ జె. మురారి (కర్నూల్), శ్రీ జె. చంద్రమౌళి (గుంటూరు), ప్రొఫెసర్ బి. వి. రామానుజం (తిరుపతి) శ్రీ ఎ. మల్లపరాజు (విజయనగరం), శ్రీ జి. వి. పున్నయ్య శాస్త్రి (గుంటూరు), కార్యదర్శి: వై. అబద్ధయ్య, కోశాధికారి: డా॥ సి. రామదాసు, ప్రాంతీయ కార్యదర్శులు: శ్రీ భాస్కరం-విజయనగరం, శ్రీ డి. వి. రెడ్డి-గుంటూరు, శ్రీ జె. వి. ధర్మారావు-వెంకటగిరి. (స్వ. వి.)

## మదనపల్లిలో 50 గంటల సైక్లింగ్

మదనపల్లి, జూలై 8: 15 సం॥ల వాడయిన టి. జ్ఞానంఅనే తిరుపత్తూరు కుర్రవాడు మొన్నటినుంచీ ఇంకా విశ్రాంతంగా సైకిల్ తొక్కుతూ విశేషజనాన్ని ఆకర్షించాడు. 50 గంటలసేపు ఒకేవిధిన సైకిల్ తొక్కే ఉద్దేశంతో ఇతడు జూలై 5 వ తేదీన సైకిల్ ఎక్కాడు.

## పశ్చిమభారత బాడ్మింటన్

బొంబాయి, జూలై 7: ఇక్కడ జరుగుతున్న పశ్చిమ భారత బాడ్మింటన్ పోటీలలో నేడు బెంగాల్ కుర్రవాడు పి-బోస్ ప్రముఖ బొంబాయి ఆటగాడు డి. ఎన్. ఛోంగ్ నే ఓడించి క్వార్టర్ ఫైనల్సులో ప్రవేశించాడు.

భారత చాంపియన్ నాడేకర్, ఆర్. ఎన్. మజుందార్, మాజీభారత చాంపియన్ అమృతలాల్ దివాన్, పి. ఎస్. చాలా, ఎం. గుహా, జి. ఎస్. హెజ్మాడీలు కూడా క్వార్టరు ఫైనల్సులో ప్రవేశించారు.

టి. ఎన్. సేన్, ఆర్. భండారీల పోటీ రేపటికి వాయిదా పడ్డది.

## పాకిస్థాన్-డెర్బీషైర్ క్రికెట్

డెర్బీ, జూలై 7: డెర్బీ షైర్ క్రికెట్ జట్టుతో ఈవేళ మూడురోజుల పోటీ ఆరంభించిన పాకిస్థాన్ క్రికెట్ జట్టు మొదటిఇన్నింగ్స్‌లో 317 పరుగులకు అవుటయింది. ఆట ముగింపు వేళకు డెర్బీషైర్ వికెట్ నష్టంలేకుండా 12 పరుగులు చేసింది.

"పాకిస్థాన్‌జట్టులో హానీఫ్ 64, వకర్ హసన్ 58, ఖలీద వజీర్ 53, ఇమ్తియాజ్ అలీ 42 పరుగులు చేశారు. డెర్బీషైర్ లో మార్గర్ 53 పరుగులకు 4 వికెట్లనూ, కార్టర్ 82 పరుగులకు 4 వికెట్లనూ తీసుకున్నారు.

## ప్రపంచ బాంటం వెయిట్ బాక్సింగ్

బాంకాక్, జూలై 6: ప్రస్తుతం ఖాళీగావున్న ప్రపంచ బాంటం వెయిట్ బాక్సింగ్ చాంపియన్‌షిప్ కోసం యూరపియన్ చాంపియన్ ఆర్. కోహెన్, సయాం ప్రతినిధి సి. సంక్రాత్ తో సెప్టెంబర్ 19 వ తేదీన ఇక్కడ పోటీచేస్తారు. గడచిన మే నెలలో ప్రపంచ చాంపియన్‌షిప్ పోటీలో సంక్రాత్ ఆస్ట్రేలియా ప్రతినిధి కారుతర్స్ చేతిలో ఓడిపోయినాడు.

# మదరాసు ధరలు

మదరాసు, జూలై 8:

బంగారు-వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు సవరను 1-కి ఎడ్వర్డుబొమ్మ సేల్సుటాక్సుతో సహా రు. 57-12-0

| | |
|---|---|
| పెట్లాబంగారం తులం | రు. 86-2-0 |
| మూస బంగారు | రు. 84-12-0 |
| సీమవెండి తులం100కి రెడీ | రు. 157-0-0 |
| చిల్లర ధర | రు. 1-10-0 |

వేరుశనగ

(581 పా॥ 1-కి ఎస్సుపోసా గిద్దంగులు మెషిన్-సేల్సుటాక్సుతో సహా) రు. 142-145-0-0

వేరుశెనగనూనె ఎక్స్ పెల్లర్ బిలో 8% (500పా.) రెడీ చిల్లరధర రు. 270-0-0

కొంకాయనూనె (87½ పౌనులు)

| | |
|---|---|
| అంబుమార్కు | రు. 29-4-9 |
| ఎం. ఎస్. బ్రాండ్ డబ్బా | 29-4-9 |
| రాజా బ్రాండ్ | రు. 28-12-9 |

పంచదార

| | |
|---|---|
| ఫాగోస్ సా (224 పా) | 88-12-9 |
| పుయ్యూరు (2 అందరు)8 | 88-8-9 |
| ప్యారీ | 85-0-9 |

## బొంబాయిమార్కెట్

బొంబాయి, జూలై 8: ఇవాళ బొంబాయి వెండి బంగారు మార్కెట్

| | |
|---|---|
| వెండి (100 తు.) | 154-5-0 |
| బంగారం (1 తు.) | 84-14-0 |
| సావరిన్ | 57-0-0 |

కలకత్తా మార్కెట్ ధరలు: 152-10-0 84-4-0; 57-8-0.

## ఆదోని ప్రత్తి వేరుశెనగ మార్కెట్టు ధరలు

ఆదోని, జూలై 6: ఈనెల 3వ తేదీతో అంతమైనవారంలో యిక్కడ ప్రత్తి, వేరుశెనగ ధర లీలావున్నవి:

ప్రత్తి: 392 పౌనుల అరఫుట్టి ముంగారి రు. 113-118, ఫారం 115-122-0-0, లక్ష్మి 145-150 రూ.

దూది ముంగారి సరకులేదు. ఫారం 325-328 రూ. లక్ష్మి 370-375. రూ. ప్రత్తిగింజలు ఫారం రూ 1 కి 10-10½ పా॥ లక్ష్మి 12½-12¾ పౌనులు. వేరుశెనగకాయ: 28 పా॥లు బస్తా 5-13-0 నుండి 5-14-6.

కోరమాండల్స్ 5-11-0, 5-13-6

వేరుశెనగ గింజలు: 531 పౌనులు 143-146.



Edited, Printed & Published by S. Sambhu Prasad at the AndhraPatrika Press, No. 7, Thambu Chetty St, Madras.